# A.P. టూరిస్ట్ గైడ్

**23** జిల్లాల పూర్తి సమాచారం
జిల్లాల మ్యాపులతో ఆయా ప్రదేశాల యాత్రావిశేషాలు

మైథిలీ వెంకటేశ్వరరావు

సరస్వతి పబ్లికేషన్స్
సత్యనారాయణపురం, విజయవాడ-11.

# A.P. టూరిస్ట్ గైడ్

by

## మైథిలి వెంకటేశ్వరరావు



ప్రథమ ముద్రణ : నవంబరు 1998



ముఖ చిత్రం :
**ప్రవీణా గ్రాఫిక్స్**

లే అవుట్ :
**లక్కోజు రమేష్‌బాబు**

దేవాలయాల బొమ్మల సేకరణ :
**మైథిలీ వెంకటేశ్వరరావు**

ప్రింటర్స్ :
**సాయి ఆఫ్‌సెట్, గాంధీనగర్**

ప్రచురణ :
**సరస్వతి పబ్లికేషన్స్,**
సత్యనారాయణపురం, విజయవాడ-11.

**23 జిల్లాల A.P. టూరిస్ట్ గైడ్ రూ. 23.00/-**



ఇందులోని మ్యాపులు స్కేల్ ప్రకారం లేవు. విషయ పరిజ్ఞానాన్ని పంచే ఉద్దేశ్యంతో ఈ పుస్తకం వేయటం జరిగింది.

## ఇలా చూసుకుంటూ, చదువుకుంటూ పోండి...

పై జిల్లాల్లో, ఆ జిల్లా సమాచారంతోపాటు అక్కడి

యాత్రా ప్రదేశాలు ఆ జిల్లాల్లోని అనేక ప్రాంతాలకి దూరాలు కి.మీ.లతో

# ఆంధ్రప్రదేశ్ ముఖ్యపట్టణాల మధ్య దూరముల పట్టిక (కి.మీ.లలో)

| | ఆదిలాబాద్ | వరంగల్ | కరీంనగర్ | ఖమ్మం | భద్రాచలం | నిజామాబాద్ | నల్గొండ | మెదక్ | మహబూబ్‌నగర్ | శ్రీశైలం | కర్నూలు | అనంతపూర్ | కడప | చిత్తూరు | తిరుపతి | నెల్లూరు | ఒంగోలు | గుంటూరు | విజయవాడ | మచిలీపట్నం | ఏలూరు | రాజమండ్రి | కాకినాడ | విశాఖపట్నం | విజయనగరం | శ్రీకాకుళం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| విజయనగరం | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | 53 |
| విశాఖపట్నం | | | | | | | | | | | | | | | | | | | | | | | | | 57 | 110 |
| కాకినాడ | | | | | | | | | | | | | | | | | | | | | | | | 173 | 230 | 283 |
| రాజమండ్రి | | | | | | | | | | | | | | | | | | | | | | | 70 | 210 | 267 | 320 |
| ఏలూరు | | | | | | | | | | | | | | | | | | | | | | 95 | 169 | 306 | 362 | 414 |
| మచిలీపట్నం | | | | | | | | | | | | | | | | | | | | | 80 | 175 | 236 | 404 | 497 | 550 |
| విజయవాడ | | | | | | | | | | | | | | | | | | | | 71 | 65 | 160 | 234 | 370 | 427 | 480 |
| గుంటూరు | | | | | | | | | | | | | | | | | | | 35 | 106 | 103 | 195 | 269 | 408 | 461 | 514 |
| ఒంగోలు | | | | | | | | | | | | | | | | | | 112 | 146 | 217 | 211 | 306 | 381 | 519 | 576 | 829 |
| నెల్లూరు | | | | | | | | | | | | | | | | | 124 | 233 | 268 | 339 | 333 | 428 | 502 | 614 | 698 | 751 |
| తిరుపతి | | | | | | | | | | | | | | | | 136 | 258 | 369 | 405 | 475 | 469 | 584 | 840 | 777 | 634 | 887 |
| చిత్తూరు | | | | | | | | | | | | | | | 70 | 204 | 327 | 439 | 474 | 545 | 439 | 634 | 708 | 847 | 904 | 957 |
| కడప | | | | | | | | | | | | | | 162 | 144 | 176 | 184 | 337 | 372 | 443 | 437 | 532 | 806 | 745 | 802 | 855 |
| అనంతపూర్ | | | | | | | | | | | | | 176 | 269 | 293 | 339 | 379 | 442 | 477 | 548 | 542 | 637 | 711 | 847 | 904 | 957 |
| కర్నూలు | | | | | | | | | | | | 145 | 206 | 411 | 353 | 332 | 258 | 297 | 332 | 403 | 397 | 492 | 566 | 702 | 769 | 812 |
| శ్రీశైలం | | | | | | | | | | | 180 | 325 | 346 | 408 | 390 | 287 | 163 | 227 | 262 | 333 | 327 | 422 | 498 | 632 | 689 | 742 |
| మహబూబ్‌నగర్ | | | | | | | | | | 200 | 120 | 250 | 325 | 531 | 473 | 452 | 378 | 347 | 379 | 450 | 444 | 539 | 613 | 749 | 806 | 859 |
| మెదక్ | | | | | | | | | 203 | 343 | 313 | 445 | 518 | 684 | 662 | 588 | 464 | 411 | 376 | 447 | 442 | 522 | 593 | 745 | 802 | 868 |
| నల్గొండ | | | | | | | | 205 | 181 | 220 | 318 | 450 | 381 | 543 | 800 | 465 | 343 | 237 | 202 | 273 | 267 | 337 | 436 | 547 | 604 | 657 |
| నిజామాబాద్ | | | | | | | 281 | 119 | 279 | 419 | 389 | 521 | 684 | 760 | 738 | 664 | 540 | 468 | 433 | 523 | 518 | 598 | 669 | 821 | 878 | 944 |
| భద్రాచలం | | | | | | 437 | 245 | 425 | 428 | 460 | 511 | 670 | 551 | 653 | 583 | 449 | 325 | 214 | 179 | 244 | 188 | 217 | 387 | 372 | 435 | 537 |
| ఖమ్మం | | | | | 130 | 358 | 110 | 329 | 307 | 330 | 417 | 549 | 435 | 597 | 548 | 412 | 290 | 179 | 144 | 216 | 209 | 227 | 299 | 437 | 494 | 547 |
| కరీంనగర్ | | | | 206 | 289 | 153 | 280 | 155 | 275 | 415 | 385 | 512 | 590 | 756 | 734 | 618 | 498 | 385 | 350 | 421 | 415 | 433 | 505 | 643 | 700 | 753 |
| వరంగల్ | | | 80 | 127 | 203 | 234 | 180 | 202 | 364 | 404 | 474 | 506 | 679 | 745 | 723 | 649 | 525 | 305 | 397 | 468 | 462 | 354 | 426 | 564 | 621 | 674 |
| ఆదిలాబాద్ | | 290 | 210 | 416 | 499 | 158 | 430 | 246 | 428 | 568 | 538 | 670 | 743 | 909 | 887 | 893 | 689 | 595 | 560 | 631 | 625 | 643 | 713 | 853 | 910 | 962 |
| హైదరాబాద్ | 325 | 161 | 172 | 204 | 326 | 176 | 105 | 100 | 103 | 243 | 213 | 358 | 418 | 580 | 562 | 488 | 384 | 311 | 276 | 347 | 342 | 422 | 493 | 645 | 702 | 788 |

# A.P. రోడ్ మ్యాప్


మహారాష్ట్ర
మధ్యప్రదేశ్
ఒరిస్సా
ఆదిలాబాద్
నిర్మల్
నిజామాబాద్
కరీంనగర్
మెదక్
హైదరాబాద్
శ్రీకాకుళం
విజయనగరం
విశాఖపట్నం
భద్రాచలం
రాజమండ్రి
కాకినాడ
ఖమ్మం
ఏలూరు
విజయవాడ
మచిలీపట్నం
గుంటూరు
బంగాళాఖాతం
శ్రీశైలం
వినుకొండ
కర్నూలు
ఒంగోలు
నెల్లూరు
కడప
అనంతపూర్
శ్రీకాళహస్తి
తిరుపతి
చిత్తూరు
కర్నాటక
తమిళనాడు

# ఆంధ్రప్రదేశ్

రెండు లక్షల డెబ్బయి అయిదువేల అరవై ఎనిమిది చ.కి.మీ. గల ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్... ఇందు జనాభా 6,63,04,854.

**ప్రధాన నగరాలు, పట్టణాలు :** హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్టణం, కరీంనగర్, నిజామాబాద్, మహబూబ్‌నగర్, నల్గొండ, ఖమ్మం, కొత్తగూడెం, గోదావరిఖని, భద్రాచలం, కాకినాడ, రాజమండ్రి, శ్రీకాకుళం, విజయనగరం, తిరుపతి, తెనాలి, వరంగల్, నెల్లూరు, చీరాల, సంగారెడ్డి, ఆదిలాబాద్, ఆదోని, భీమవరం, అనంతపురం, చిత్తూరు, కడప, కర్నూలు, గుంటూరు.

**సరిహద్దులు :** 12°-14 – 19°-15 ఉత్తర అక్షాంశములు 76°50 - 84°44 తూర్పు రేఖాంశాల మధ్య వుంది మన రాష్ట్రం.

ఆంధ్రప్రదేశ్‌కు తూర్పున బంగాళాఖాతం, పశ్చిమాన కర్నాటక, దక్షిణాన తమిళనాడు, ఉత్తరాన వాయవ్యదిశగా మహారాష్ట్ర, ఈశాన్యంలో మధ్యప్రదేశ్, ఒరిస్సాలున్నాయి. ప్రధాన భాషలు : తెలుగు, ఒరియా, ఉర్దూ.

**వాతావరణం :** సమ్మర్ 41°C నుంచి 20°C చలికాలం 32°C నుంచి 13°C వరకు.

**విశ్వవిద్యాలయాలు :** జవహర్‌లాల్ టెక్నోలాజికల్ యూనివర్శిటీ (హైదరాబాద్), కృష్ణదేవరాయ (అనంతపూర్), వెంకటేశ్వర, పద్మావతి విశ్వవిద్యాలయాలు తిరుపతిలో కలవు. ఇంకా కాకతీయ వరంగల్‌లోనూ, ఆంధ్రా విశాఖపట్టణాలలో, ఉస్మానియా యూనివర్శిటి హైద్రాబాద్‌లోనూ, నాగార్జున విశ్వవిద్యాలయం గుంటూరు-విజయవాడ రోడ్డులైనులలో ఉంది.

**అడవులు :** ఆంధ్రప్రదేశ్ వైశాల్యం 2,76,754 చ.కి.మీ. ఇందు అటవీ ప్రాంతం 63,813 చ.కి.మీ.

**యాత్రాపర్యాటక ప్రదేశాలు :** తిరుపతి, శ్రీకాళహస్తి, కైలాసనాథ కోన జలపాతం, పులికాట్ సరస్సు, నాగలాపురం, నెల్లూరు ఓడరేవు, అమరావతి, వైకుంఠపురం,

...కాసి. మంగళగిరి. ఉండవల్లి, విజయవాడ, కొండపల్లి, వేదాద్రి, కొల్లేరు, ద్వారకా తిరుపతి, హంసలదీవి, మోపిదేవి, క్షీరారామము (పాలకొల్లు) అంతర్వేది, ...ఎగొండ, రాజమహేంద్రవరం, ద్రాక్షారామం, అన్నవరం, సింహాచలం, విశాఖపట్టణం, హార్సిలీహిల్స్, నాగార్జునసాగర్, చేజెర్ల, కపిలేశ్వరాలయం, కోటప్పకొండ, మహానది, అహోబిలం, పుష్పగిరి, శ్రీశైలం, అలంపురం, మంత్రాలయం, లేపాక్షి, విజయనగరం, బొబ్బిలి, శ్రీకూర్మం, హైదరాబాద్, వరంగల్లు, రామప్పగుడి, హనుమకొండ, యాదగిరి గుట్ట, భద్రాచలం, శ్రీకాకుళం.

ఈ ప్రదేశాలన్నీ నవంబర్ నుంచి జూన్ నెలలో దర్శిస్తే ప్రకృతి రమణీయతను అస్వాదించవచ్చు. ఇంకా ముఖ్యంగా ఫిబ్రవరి, మార్చి లోపలయితే భూమి పచ్చపట్టు చీర కట్టుకున్న తెలుగింటి ఆడపడుచులా ఉంటుంది. తనువు పులకించి అద్వితీయమైన అనుభూతి మీకు మిగులుతుంది.

## టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ కేంద్రాలు

- ★ ఆంధ్రప్రదేశ్ ట్రావెల్ మరియు టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్, "యాత్రినివాస్" ఎస్.పి.రోడ్, సికింద్రాబాద్ - 500 003. ఫోన్ : 817672, 816375.
- ★ టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ ఆఫీసర్, రీజనల్ టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ బ్యూరో, హిల్‌కాలనీ, నాగార్జునసాగర్-508 202. ఫోన్ : 2133-34.
- ★ టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ ఆఫీసర్, రీజనల్ టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ బ్యూరో, Ist ఫ్లోర్, నెహ్రూలానగర్, షాపింగ్-కమ్-ఆఫీస్ కాంప్లెక్స్, విశాఖపట్టణం. ఫోన్ : 63016.
- ★ టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ ఆఫీసర్, రీజనల్ టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ బ్యూరో, టూరిస్ట్ రెస్ట్‌హౌస్, కాజీపేట, వరంగల్. ఫోన్ : 6201
- ★ టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ కౌంటర్, ఫ్లాట్ నెం-1, కాజీపేట రైల్వేస్టేషన్.
- ★ టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ ఆఫీసర్, రీజనల్ టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ బ్యూరో, III చౌల్ట్రీ దగ్గర, తిరుపతి. ఫోన్ : 23208.

★ టూరిస్ట్ ఇన్‌ఫర్మేషన్ సెంటర్, తిరుపతి. రైల్వేస్టేషన్.

★ టూరిస్ట్ ఇన్‌ఫర్మేషన్ ఆఫీసర్, రీజనల్ టూరిస్ట్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో, గోపాల్‌రెడ్డిరోడ్, పాతబస్టాండ్ ఎదురు, విజయవాడ-520 002.

★ అసిస్టెంట్ మేనేజర్ (ట్రాన్స్‌పోర్ట్), క్రిష్ణవేణి మోటల్, సీతానగరం, విజయవాడ. ఫోన్ : 426382.

★ డిప్యూటీ డైరెక్టర్, ఎ.పి. స్టేట్ టూరిస్ట్ ఇన్‌ఫర్మేషన్ సెంటర్, ఎ.పి. భవన్, అశోకా రోడ్, న్యూఢిల్లీ - 110 001. ఫోన్ : 381293.

★ మేనేజర్ Govt., ఆఫ్ ఇండియా టూరిస్ట్ ఆఫీస్, సన్‌రోజ బిల్డింగ్, హిమయత్‌నగర్, హైదరాబాద్-500 029. ఫోన్ : 666877

★ ఆంధ్రప్రదేశ్ టూరిస్ట్ ఇన్‌ఫర్మేషన్ సెంటర్, హోటల్ ఫ్లామింగో పానాజిగోవా.

★ ఆంధ్రప్రదేశ్ స్టేట్ టూరిస్ట్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో, 5th ఫ్లోర్ గగన్‌విహార్, Mg. రోడ్, హైదరాబాద్ - 500 001, ఫోన్ : 4732554.



# శ్రీకాకుళం జిల్లా


ఒరిస్సా
విజయనగరం
ముఖలింగం
మందస
ఇచ్ఛాపురం
సోంపేట
శ్రీకాకుళం
నరసన్నపేట
అరసవల్లి
కళింగపట్నం
బంగాళాఖాతము

# శ్రీకాకుళం జిల్లా



**చరిత్ర :** ఆంధ్రప్రదేశ్‌కి కోస్తాలో ఉత్తరాన వున్న ఈ జిల్లా 18°20 - 19 10 ఉత్తర అక్షాంశము మీద 83°01 - 84°54, తూర్పు రేఖాంశముల మధ్య వుంది. ఈ జిల్లాకు సరిహద్దులు ఉత్తరాన ఒరిస్సా, దక్షిణాన, పశ్చిమాన విజయనగరం జిల్లాలు ఉన్నాయి. ఇక తూర్పున బంగాళాఖాతం వుంది.

శ్రీకాకుళం ముఖ్య జిల్లా కేంద్రమయిన ఈ జిల్లా చరిత్ర కళింగ రాజ్యంలో ఒకప్పుడు భాగం. ఈ జిల్లాలోని అనేక ప్రాంతాలను చేదివంశపు రాజులతోపాటు శాతవాహనులు, గోల్కొండ నవాబులు పరిపాలించారు.

ఈ జిల్లా వైశాల్యం 5837 కి.మీ.

ఇందు జనాభా 23,21,000. ఒక్క లోక్‌సభ నియోజకవర్గం, శాసనసభ నియోజక వర్గాలు 13.

37 మండలాలుగల ఈ జిల్లాలో ముఖ్యమైన నదులు నాగావళి, మహేంద్రతనయ, వంశధార.

**ఇక్కడి ముఖ్యపంటలు :** రాగులు, సజ్జలు, పెసలు, వేరుశనగ, జీడిమామిడి, నువ్వులు.



శ్రీ ముఖలింగేశ్వర దేవాలయదృశ్యము, ముఖలింగం, శ్రీకాకుళం జిల్లా

ఈ శ్రీకాకుళం నుంచి అనేక ప్రాంతాలకు దూరం (కి.మీ.లలో) - నరసన్నపేట 24, పాలకొండ 45, రాజాం 40, ఇచ్ఛాపురం 149, సోంపేట 12.

**ముఖ్యలింగ క్షేత్రము :** ఆముదాలవలస నుంచి 30 కి.మీ. ఇక్కడి స్వామి శ్రీముఖలింగేశ్వరస్వామి. ఈ దేవాలయాన్ని శ్రీ మధుకేశ్వరస్వామి దేవాలయం అని కూడా అంటారు. ఈ ఆలయానికి పంచపీఠస్థలమని ప్రసిద్ధి కూడా!

**రావివలస :** టెక్కలి మండలంలో వున్న రావివలసలో మల్లికార్జునస్వామి దేవాలయం వుంది. ఇక్కడి శివలింగం చాలా పెద్దది.

## శ్రీకూర్మం

శ్రీ కూర్మనాథస్వామి ఆలయం, ఈ దేవాలయంతోపాటు శ్రీ రామానుజాచార్యులు, శ్రీవరద రాజస్వామి, శ్రీ మధ్వాచార్యులు, శ్రీ కోదండరామస్వామి ఆలయాలు కూడా వున్నాయి. అతి ప్రాచీనమైన ఈ క్షేత్రంలో స్తంభాల మీద అపురూపమైన శిల్పాలు చెక్కి ఉన్నాయి. అరసవిల్లికి 8 కి.మీ. దూరంలో వున్న ఈ

క్షేత్రంలో స్వామి పడమటి ముఖముగా ఉంటారు. ఈ ఆలయంలో రెండు ధ్వజ స్థంభాలున్నాయి. శ్రీకాకుళం నుండి 15 కి.మీ. దూరంలో వుందీ క్షేత్రం.

**అరసవిల్లి :** సూర్యదేవాలయం ఉంది. ఇక్కడ గర్భగుడిలో సూర్యుడి విగ్రహం పాదాల మీద - ఉదయించే సూర్యుడి కిరణాలు పడటం విశేషం. ఈ ఆలయం క్రీ.శ. 672లో నిర్మించారు. ఇక్కడే ఇంద్రుడు ఆరోగ్యవంతుడయ్యాడు. ఎక్కడెక్కడ్నించి ఇక్కడికి ఆరోగ్యం కోసం వస్తారు. గుడిలో చక్కని శిల్పాలున్నాయి. శ్రీకాకుళం నుండి 2 కి.మీ. దూరంలో వుందీ క్షేత్రం.

**మందస :** మహేంద్రగిరి పర్వత పాదాల వద్ద గల చూడదగినది పాండవుల గుట్ట. ఈ ప్రదేశంలోనే పాండవులు అజ్ఞాతవాసం చేసినది. వరాహస్వామి దేవాలయం గల ఇక్కడ శివరాత్రికి బ్రహ్మాండమైన ఉత్సవం జరుగుతుంది.

**సంగం :** పంచలింగాల్లో ఒకటిగా భక్తులచే కొనియాడబడుతున్న క్షేత్రం. ఇక్కడే సువర్ణముఖి, నాగావళి, వేదవతి నదుల సంగమస్థానం.

**పొందూరు :** ఇక్కడ బ్రహ్మాండమైన ఖాది వస్త్రాలు నేస్తారు. ఈ పొందూరు శ్రీకాకుళానికి 21 కి.మీ.





అరసవిల్లి శ్రీ సూర్యానారాయణ దేవాలయం

**శాలిహుండం** : ఇక్కడ అద్భుతమైన బౌద్ధ ఆరామాలు మనల్ని ఆహ్లాదపరుస్తాయి. వంశధారా నది ఒడ్డున వున్న ఈ ప్రదేశం మనల్ని మంత్రముగ్ధుల్ని చేస్తుంది.

**తేలినీలాపురం** : ఇక్కడే చక్కటి పక్షి సంరక్షణ కేంద్రము వుంది. దూరప్రదేశం నుంచి ఇక్కడికి కొంగలు శీతాకాలంలో వస్తాయి.

శ్రీకాకుళం జిల్లాలోని బారువ (శ్రీకాకుళానికి 65 కి.మీ. దూరం)లో శ్రీ కోటి లింగేశ్వర ఆలయం, జనార్ధనస్వామి దేవాలయంతోపాటు ప్రకృతి శోభ కలిగిన కవిటి కూడా దర్శించదగ్గది.

ఈ శ్రీకాకుళం పట్టణమందు నాగావళి నదీ తీరన బలరామ ప్రతిష్ఠితమైన శ్రీ ఉమారుద్ర కోటేశ్వర స్వామి ఆలయం వుంది. ఇక్కడి నందీశ్వర విగ్రహం తప్పక చూడదగ్గది.



# విజయనగరం జిల్లా


ఒరిస్సా
పార్వతీపురం
శ్రీకాకుళం
చీపురుపల్లి
గజపతినగరం
రామతీర్థాలు
విజయనగరం
విశాఖపట్నం జిల్లా
బంగాళాఖాతము

# విజయనగరం జిల్లా



చరిత్ర : క్రీ.పూ. 4వ శతాబ్దంలో కళింగ రాజ్యంలో భాగంగా వున్న నేటి విజయనగరం జిల్లా 17°50' - 19°15' ఉత్తర అక్షాంశముల మధ్య, 82°0' నుంచి 83°45' తూర్పు రేఖాంశాల మధ్య వుంది.

ఈ జిల్లా ముఖ్య కేంద్రం విజయనగరం. దీని వైశాల్యం 6,539 చ.కి.మీ., ఇందు జనాభా 21,10,000. శాసనసభ నియోజకవర్గాలు 12, లోక్‌సభ నియోజకవర్గాలు రెండు. ఇక్కడి ముఖ్య నదులు సువర్ణముఖి, గోస్తని, గోముఖి, నాగావళి. ఇక్కడి ముఖ్య పంటలు సజ్జలు, రాగులు, వరి, గోగునార.

ఈ విజయనగరం జిల్లాలోనే ఒకప్పుడు చరిత్ర ప్రసిద్ధి పొందిన బొబ్బిలియుద్ధం జరిగినది. అనేక పుణ్యక్షేత్రాలు గల ఈ విజయనగరం నుంచి అనేక ప్రాంతాలకు దూరం (కి.మీ.లలో) పార్వతీపురం - 85, శృంగవరపు కోట 46, సాలూరు 57, గజపతినగరం 19, రామచంద్రపురం 48, విశాఖపట్టణం 110.

బొర్రా గుహలు : పదో శతాబ్దం నాటి గుహలు. ఈ ప్రదేశం విశాఖ నుంచి 110 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడికి నగరం నుంచి రైలు, బస్సు సౌకర్యాలున్నాయి.

**తోటపల్లి :** పార్వతీపురం సమీపంలో నాగావళి తీరంలో తోటపల్లి వద్ద శ్రీ వేంకటేశ్వరాలయము వుంది.

**రామతీర్థాలు :** విజయనగరానికి 15 కి.మీ. దూరంలో వున్నాయి ఈ తీర్థాలు. వాస్తుశాస్త్ర ప్రామాణికముగా కొండ ప్రక్క నిర్మించిన ఈ క్షేత్రం భక్తజనులను విశేషంగా ఆకర్షిస్తుంది.

**పుణ్యగిరి :** విజయనగరానికి 25 కి.మీ. దూరంలో శృంగవరపు కోటకు 5 కి.మీ. దూరంలో వుంది క్షేత్రం.

**కుమిలి :** ఇక్కడ అనేక చిత్రశిల్పాలు మనల్ని అబ్బురపరుస్తాయి.

**విజయనగరం :** రాజగృహాలు, యుద్ధంలో బాగా చితికిన కోటతోపాటు గ్రామదేవత పైడితల్లి ఆలయం యిక్కడ వుంది. విజయనగర సంస్థానాధీశుల కోటలో రాజభవనాలు చూడవచ్చు. ఇక్కడ గురజాడ అప్పారావు ఇల్లు చూడొచ్చు. ఇక్కడే రామతీర్థం వెళ్ళటానికి బండి మారవలసి ఉంటుంది. ఇక్కడ బౌద్ధక్షేత్రాలున్నాయి.

**తాటిపూడి :** శృంగవరపు కోట నుంచి దగ్గర. చక్కటి శోభాయమైన జలాశయం వుంది.



# విశాఖపట్టణం జిల్లా



చరిత్ర : నందవంశరాజులు, చాళుక్యులు, మౌర్యులు పరిపాలించిన ఉక్కునగరం ఇదే. ఈ విశాఖజిల్లా వైశాల్యం 11,161 చ.కి.మీ. ఇందు జనాభా 32,85,000. లోకసభ నియోజక వర్గములు - 2, శాసనసభ నియోజక వర్గములు - 13, అడవులు 42.80%.

ఈ జిల్లా ఉత్తర కోస్తాలో మూడవది. ఈ జిల్లా 18°00' - 17°50' ఉత్తర అక్షాంశములు, 87°29' - 82°35' తూర్పు రేఖాంశాలకు మధ్యన వుంది. ఒకప్పుడు జాలరిపేటగా పిలవబడిన ఈ విశాఖపట్టణం యొక్క సరిహద్దులు - ఉత్తరాన విజయనగరం, తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన తూర్పుగోదావరి, పడమరన ఒరిస్సా వున్నాయి.

నదులు : శారద, వరాహ, గోస్తానీ, చంపావతి, సరుగుడు గడ్డ, మేఘాద్రి గడ్డ, మాచ్‌ఖండ్.

ఈ విశాఖలో స్టీల్‌ప్లాంట్, HPCL, షిప్‌యార్డ్, కోరమాండల్, ఎ.సి.సి. సిమెంట్ లాంటి ఎన్నో భారీ పరిశ్రమలున్నాయి.



శ్రీ వరాహలక్ష్మీ నరసింహస్వామి దేవాలయము
సింహాచలం – విశాఖ జిల్లా

ఈ విశాఖపట్టణం నుంచి అనేక ప్రాంతాలకి దూరం (కి.మీ.లలో) - భీమిలి 30, అనకాపల్లి 43, పోతవరం 60, నర్సీపట్నం 70, యలమంచిలి 60, సింహాచలం 16.

ఇక విశాఖజిల్లాలో దర్శించదగ్గ పుణ్యక్షేత్రాలు, విహార స్థలాలు -

## సింహాచలం

విశాఖపట్టణం పరిసర ప్రాంతాల్లో ఆప్యాయంగా సింహాద్రి అప్పన్నగా పిలుస్తారు. ఈ దేవాలయం 11వ శతాబ్దానికి ముందు నిర్మించబడినది. కొండ మీద గోదావరి, గంగ, కూర్మ, మాధవ ఆకాశధారలను హనుమద్వారము వరకూ చూడొచ్చు. శ్రీ మహావిష్ణువు అవతారమైన ఈ వరాహనృసింహస్వామి క్షేత్రంలో వైశాఖ శుద్ధ తదియనాడు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. సంవత్సరం పొడవున చందనంతో మెత్తి నింపి వేయబడిన స్వామి నిజరూపాన్ని దర్శించటానికి లక్షల మంది వస్తారు. ఈ వరాహలక్ష్మి నరసింహస్వామి సన్నిధిలో 14-15 శతాబ్దములో (1428) కళింగ దిగ్విజయ యాత్ర ముగించి సింహాద్రి నాధుని దర్శించి నిర్మించిన శ్రీకృష్ణదేవరాయల 'విజయధ్వజము' శిలా శాసనము కలదు. ఇంకా కుళుత్తోంగ చోళుడు కట్టించిన మంటపాలు, స్థూపాలతోపాటూ సంతాన గోపాల యంత్ర ప్రతిష్టమైన కప్పస్థంభము కలవు. ఈ సింహాచల క్షేత్రం విశాఖ నుంచి 16 కి.మీ.లలో సముద్ర మట్టానికి 800 అడుగుల ఎత్తులో ఉంది. క్రీ.శ. 1098 తర్వాత చెక్కిన 500 శిలాశాసనాలు ఉన్నాయి. ఇక్కడున్న కప్ప స్థంభాన్ని కౌగిలించుకొని కోరుకుంటే కోరిన కోరిక తీరుతుందని నమ్మకం. కొండమీదకు మెట్లు, బస్సు ద్వారా వెళ్ళవచ్చు. స్వామి సర్వదర్శనం 7 నుండి సా. 4 వరకూ, మళ్ళీ 6 నుండి 7 వరకూ తిరిగి 8 నుండి 9 వరకు..... ఉండటానికి APTDC చందన టూరిస్ట్ రెస్ట్‌హౌస్, దేవస్థానముల సత్రాలు, గదులు కలవు.

**భీమునిపట్నం :** భీమసేనుడు బకాసురుని వధించిన ప్రదేశం. అందుకే ఆ పేరు. ఇక్కడ డచ్ సమాధులున్నాయి. ఉగ్రనరసింహస్వామి ఆలయంతోపాటు ఆహ్లాదకరమైన బీచ్ ఆకర్షణ.



అప్పికొండ : 11వ శతాబ్దంనాటి సోమేశ్వరాలయం వుంది. ఈ క్షేత్రం విశాఖ నుంచి 35 కి.మీ.

కృష్ణదేవిపేట : రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యాన్ని గడగడలాడించిన అల్లూరి సీతరామరాజు సమాధి వుంది.

శంకారం : అనేక బౌద్ధ స్థూపాలు విగ్రహాలు గల ఈ శంకారం విశాఖ నుంచి 41 కి.మీ.

ఋషికొండ : సముద్రపు గాలి సరుగుడు చెట్లతో కలిసి మనల్ని పుక్కిరి బిక్కిరి చేస్తుంది. ఇక్కడ సప్తరుషేశ్వర స్వామి ఆలయం వుంది. సప్తఋషుల్లు యజ్ఞంచేసి శివలింగం, గంగా త్రిపుర సుందరీల విగ్రహాలు ప్రతిష్ఠించారని స్థల మహాత్యం చెబుతోంది. ఈ ఆలయం చుట్టూ బావులున్నాయి. దేవుడి మహాత్యం ఇక్కడ తెలుస్తుంది. ఈ బావుల్లో మంచినీరు వుంటుంది. (దగ్గరలో సముద్రం వుంది) ఇంకా పాడేరు ఏజెన్సీ ప్రాంతంలో మోదకొండమ్మ, పొట్నూరులో శ్రీకృష్ణదేవరాయల విజయస్థూపం విశాఖకు 30 కి.మీ. దూరంలో గంగవరం బీచ్,

యలమంచిలి సమీపంలో పంచధారలు. ఈ పంచధారలు అనకాపల్లి నుంచి 24 కి.మీ. దూరం.

**పంచధారలు :** ఫణిగిరి ధర్మలింగేశ్వర ఆలయంలోని శివలింగాన్ని సాక్షాత్తు యముడు నిర్మించాడని స్థలమహాత్మ్యం చెబుతోంది. ఇక్కడ ఐదు ధారలు నిరంతరం పడుతూండడంవల్ల ఈ పేరు వచ్చింది. ఇక్కడ అనేక శిల్పాలు ఉన్నాయి. ఇంకా నూకాంబికా అమ్మవారు విశాఖ నుంచి 35 కి.మీ. దూరంలో అనకాపల్లిలో ఉంది.

**అరకులోయ :** విశాఖ నుండి 900 మీటర్ల సముద్రమట్టానికి ఎత్తున వున్న ఈ అద్భుత లోయ అణువణువు ప్రకృతి రమణీయత. ఇక్కడికి రైలు ద్వార విశాఖ నుంచి వెళితే మంచి అనుభూతి. అనేక కొండ జాతులవారు ఇక్కడ నివశిస్తున్నారు.

**విశాఖపట్టణం :** ఇక్కడ ఉడాపార్క్, కైలాసగిరి, జూపార్క్, రామకృష్ణబీచ్, డాల్ఫిన్స్ నోస్, లైట్‌హౌస్, సర్క్యూట్ హౌస్ వున్నాయి.



# తూర్పుగోదావరి జిల్లా


మధ్యప్రదేశ్
విశాఖ జిల్లా
ఖమ్మం
జిల్లా
అన్నవరం
రాజమండ్రి
కాకినాడ
పశ్చిమగోదావరి జిల్లా
రావులపాలెం
అమలాపురం
బంగాళాఖాతము
అంతర్వేది

# తూర్పుగోదావరి జిల్లా



చరిత్ర : మౌర్యులు, కొండవీటి రెడ్డిరాజులు, గజపతులు, చోళులు, శాతవాహనులు పరిపాలించిన ఈ జిల్లా అత్యంత సారవంతమయిన జిల్లా. ఈ జిల్లా వైశాల్యం 10,807 చ.కి.మీ. ఇందు జనాభా 45,41,000. లోకసభ నియోజకవర్గాలు 3, శాసనసభా నియోజక వర్గములు 10. అడవులు 31%.

ఈ జిల్లా 16°10' - 17°50 ఉత్తర అక్షాంశములు, 80 29 - 82 37 తూర్పు రేఖాంశాల మధ్యన వుంది.

కాకినాడ ముఖ్యకేంద్రమయిన ఈ జిల్లా సరిహద్దులు. పశ్చిమాన ఖమ్మం, పశ్చిమగోదావరి; ఉత్తరాన మధ్యప్రదేశ్, ఒరిస్సా; తూర్పు దక్షిణాలలో బంగాళాఖాతం కలవు.

ముఖ్య నదులు : గోదావరి, ఏలేరు.

పరిశ్రమలు : ఇక్కడ ఎరువుల కర్మాగారము, పేపరు, పాల ఉత్పత్తులు, ఇంజనీరింగ్, రైస్, జిన్నింగ్, పింగాణీలాంటి పరిశ్రమలున్నాయి.

పంటలు : వరి, జొన్న, సజ్జ, రాగులు, చెరుకు, పొగాకు, వేరుశెనగ, అరటి, కొబ్బరి, జీడిమామిడితోపాటు మామిడి.

ఈ జిల్లా ముఖ్యకేంద్రమయిన కాకినాడ నుంచి అనేక ప్రాంతాలకు దూరం (కి.మీ.లలో) : పిఠాపురం 18, తుని 79, రామచంద్రపురం 29, రాజోలు 119, అమలాపురం 90, అర్లతిగల 103, రాజమండ్రి 73.

అద్భుత కావ్యం 'మహాభారతాన్ని' నన్నయ్య ఈ జిల్లాలోనే తెనిగించాడు. అలాంటి ఈ జిల్లాలో చూడాల్సిన ఆధ్యాత్మిక ప్రదేశాలు, విహార స్థలాలు.

## రాజమండ్రి

రాజరాజ నరేంద్రుడు ఈ రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకొని 11వ శతాబ్దం ముందువరకూ పాలించాడు. ప్రతి పన్నెండు సంవత్సరాలకి ఇక్కడ



శ్రీ భీమేశ్వర, మాణిక్యాంబ దేవాలయము

ద్రాక్షారామం

గోదావరి పుష్కరాలు జరుగుతాయి. కోటిలింగాలరేవు, లింగేశ్వరస్వామి ఆలయం, ధవళేశ్వరం ఆనకట్ట, మార్కేండేయ ఆలయము ముఖ్యంగా చూడాల్సినవి. వసతికి మహాలక్ష్మి, హోటల్ పంచవటి, పుష్కరగేట్.



ర్యాలి : రాజమండ్రి నుండి 25 కి.మీ. దూరం గోదావరి నదీ శాఖలైన గౌతమి, వశిష్ట పాయలమధ్య వెలకొని వుంది శ్రీ జగన్మోహినీ కేశవస్వామి ఆలయం. అయిదు అడుగుల ఎత్తు, మూడు అడుగుల వెడల్పు కలిగిన సాలగ్రామ శిలయందు స్వయంవ్యక్తం. ఎదుట పురుష రూపం, వెనుక స్త్రీ రూపం గల ఈ స్వామిని దర్శించి తరించటం అంటే పూర్వజన్మ సుకృతం.

కోటిపల్లి : తూర్పుగోదావరి జిల్లాలో కాకినాడ పట్టణానికి దగ్గరలో పామర్రు మండలంలో వున్న ఈ పుణ్య క్షేత్రం గురించి బ్రహ్మాండ పురాణంలోనూ స్కాంద పురానంలోనూ ఈ క్షేత్రం పుణ్యగాథ వుంది.

ఈ కోటిపల్లిలో దేవేంద్రుడు నిర్మించిన స్వయం భూ శివలింగం వుంది. యోగలింగంగా కూడా భావిస్తారు. పాతాళం నుంచి ఉద్భవించిన ఈ లింగంకు ఉత్సవాలు వుండవు. కారణము యోగలింగం అవటంవలన. ఈ కోటిపల్లి కోటేశ్వరుడు మేషమీనాది అయిదు మాసాలు కోటి తీర్థ జలంలో వుంటాడు. మిగతా ఏడు మాసాలు కోటి తీర్థ జలలింగాన్ని చేరి నేలమట్టం వరకూ తొణికిసలాడుతూ భక్తుల కన్నులను తరింపచేస్తాడు.

## ద్రాక్షారామం

దక్షప్రజాపతి అనేక యజ్ఞాలు చేయటం వల్ల ద్రాక్షారామమని పేరువచ్చింది. ఇక్కడి భీమేశ్వరస్వామి స్ఫటికలింగము. పదిహేను అడుగుల ఎత్తున వుండే ఈ లింగము ప్రసిద్ధి చెందినది. ఇక్కడి ఆలయాన్ని చాళుక్య భీముడు కట్టించాడు.



శ్రీ శవీశ్వర దేవాలయము : మందపల్లి

దక్షిణ కాశిగా ప్రసిద్ధి చెందిన ఈ ద్రాక్షారామం పంచరామాలలో ఒకటి. మిగతావి అమరారామము, భీమారామము, క్షీరారామము, కుమారారామం. ఇక్కడి శివలింగము ఎత్తు 15 అడుగులు కాగా చుట్టూ రెండంతస్థుల ఆలయం వుంది. ఆలయం క్రింది అంతస్థు చీకటిగా వుంటుంది. ఈ అంతస్థులో భక్తులు ప్రదక్షిణ జరిపి పై అంతస్తులో అర్చనలు జరుపుతారు.

శ్రీ మందేశ్వరస్వామి దేవస్థానం : తూర్పు గోదావరి జిల్లా కొత్తపేట మీదుగా అమలాపురం పోవు బస్సు మార్గమున 8 కి.మీ. దూరంలో ఈ మందపల్లి కలదు. ఈ మందపల్లి క్షేత్రమున పదునాలుగువేల నూటెనిమిది పుణ్యతీర్థములు కలవు. ఇక్కడి మందేశ్వరస్వామి వారికి పూజాకార్యక్రమములను డబ్బు మనియార్డరు చేసిన వారికి కూడా జరుపుతారు.



## అన్నవరం

శ్రీ వీర వేంకట సత్యనారాయణ స్వామి ఆలయము. ఆంధ్రులు తమ ఇంట ఏ శుభకార్యం జరిగినా ఈ స్వామి వ్రతం తప్పక చేసుకుంటారు. శ్రీ పిడపర్తి కృష్ణమూర్తిగారు నిర్మించిన సన్‌డయల్ (కాల నిర్ణయ సూచిక యంత్రం) స్వామి



## అన్నవరం

సన్నిధిలో రత్నగిరి మీద వుంటుంది. ఎండ ఆధారంగా కాల నిర్ణయం చేస్తుందీ గడియారం. పవిత్ర పంపానదీ తీరాన రత్నగిరి సానువుల దరి అన్నవరం గ్రామం పక్కన ఖరనామ సంవత్సర శ్రావణశుద్ధ విదియనాడు శ్రీ సత్యదేవుడు స్వయం వ్యక్తమైన ఈ దివ్యక్షేత్ర సందర్శనం మహాభాగ్యం. స్వామి దర్శన వేళలు ఉ॥ 6 నుండి రాత్రి 8 వరకూ.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారితో సంప్రదించి కాటేజీలు, గదులు పొందవచ్చు. కొండమీద వసతికి, భోజనానికి ఎలాంటి ఇబ్బందీ వుండదు.





## మామిడి కుదురు

అప్పనపల్లి : మామిడికుదురు మండలంలోని అప్పనపల్లిలోని శ్రీబాలాజీ స్వామిని దర్శించటానికి జగ్గయ్యపేట నుంచి 10 కి.మీ. దూరం. ఈ క్షేత్రం ఉత్తర

కాశీగా పిలవబడుతుంది. అనేక మహర్షులు ఇచ్చట అర్పణము చేసినందున అప్పనపల్లిగా పేరు వచ్చింది.

## పిఠాపురం

అష్టాదశ శక్తి పీఠాల్లో 10వది. ఇక్కడ లింగం కోడి ఆకారంలో వుంటుంది. విజయవాడ నుంచి వైజాగ్ వెళ్ళే దారిలో వుంది ఈ పీఠం.

**తంటికొండ** : తూర్పుగోదావరి జిల్లా గోకవరం వద్ద వుంది. ఇక్కడ స్వామి శ్రీ వెంకటేశ్వరస్వామి. బహుళ ప్రసిద్ధి పొందిన క్షేత్రమిది.

ఈ తూర్పు గోదావరి జిల్లాలోని సామర్లకోటలో కొండ మీద సీతారాముల పాద ముద్రలు ఉన్నాయి.

**కోరుకొండ** : శైవవైష్ణవ క్షేత్రం. రాజమహేంద్రవరానికి 20 కి.మీ. దూరంలో వున్నది లక్ష్మీ నరసింహాలయం. దశావతరాలకే సంబంధించిన శిల్పాలతోపాటు శ్రీరామక్రతు స్తంభం వుంది.

**అంతర్వేది** : శ్రీ లక్ష్మీనరసింహస్వామి పురాతన ఆలయం వుంది. గోదావరి సముద్రం కలిసే చోటు వీక్షించవచ్చు. సముద్రపు నీరు, గోదావరినీరు విడివిడిగా పారుతుండే ప్రదేశం వుంది. దీన్నే అన్నాచెల్లెళ్ళ గట్టు అంటారు. నర్సాపురం నుంచి పడవలో వెళ్ళొచ్చు.

**సర్పవరం** : అతి ప్రాచీనమైన భావన నారాయణస్వామి ఆలయం వుంది. ఇక్కడే నారదగుండము, ముక్తిగుండము వున్నాయి.

**ముక్తేశ్వరం** : కోరిన వెంటనే ముక్తినిచ్చే ఈ ముక్తేశ్వరం అమలాపురానికి 12 కి.మీ. దూరంలో వుంది.

**మారేడుపల్లి** : చక్కటి అటవీ ప్రాంతము.

**ధవళేశ్వరం** : రాజమండ్రికి దగ్గర. ఇక్కడున్న అగస్త్యేశ్వర దేవాలయం పరిసరాల్లో వున్న సొరంగం ద్వారా కాశీకి కూడా పోవచ్చని అంటారు. ఈ ధవళేశ్వరంలో సీతరాముల పాదములతోపాటు కాటన్ మ్యూజియం వుంది.

# పశ్చిమగోదావరి జిల్లా



# పశ్చిమ గోదావరి జిల్లా



చరిత్ర : మౌర్యులు, శాతవాహనులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండీనులు, చాళుక్యులు, కొండవీటి రాజులతో పాటు గోల్కొండ నవాబులు పాలించిన జిల్లా. ఏలూరు ముఖ్యకేంద్రమయిన ఈ జిల్లా 16°15 - 17°30 ఉత్తర అక్షాంశములు 80°50' - 81°55' తూర్పు రేఖాంశం పైకలదు.

1925లో కృష్ణాజిల్లా నుంచి వేరుచేసి పశ్చిమగోదావరిగా ఏర్పాటు చేసిన జిల్లా వైశాల్యం 7,742 కి.మీ. ఇందు జనాభా 35,17,000. అడవుల శాతం 10.46%.

లోక్‌సభ నియోజకవర్గములు 2. శాసనసభ నియోజకవర్గములు 16. ఈ జిల్లాలో ముఖ్యపంటలు జొన్న, వరి, మినుములు, వేరుశెనగ, మొక్కలు, చెఱకు, పొగాకు.

నదులు : తుమ్మిలేరు, కొవ్వాడ, తమ్మిలేరు, గోదావరి, గుండేరు, రాళ్ళమడుగు.

పరిశ్రమలు : తెలుగునాట ప్రతి ఇంట వెలిగే అంబికా దర్బార్‌బత్తి సంస్థ ఈ జిల్లాలోని ఏలూరులోనే! ఆ సుగంధ భరితమైన అగర్‌బత్తి పరిశ్రమలతోపాటు పంచదార, తోళ్ళ, రైస్‌మిల్లులు, ఎరువులు లాంటివి అనేకం. గోదావరి పశ్చిమంగా



అంతర్వేది దేవాలయము, పశ్చిమ గోదావరి జిల్లా

వుండటంతో పశ్చిమగోదావరిగా పిలవబడే ఇక్కడ విహార తీర్థ ప్రదేశాలు ఎన్నో. దానికి ముందు ఏలూరు నుంచి అనేక ప్రాంతాలకి దూరం (కి.మీ.లలో)

చింతలపూడి 50, తాడేపల్లిగూడెం 54, భీమడోలు 19, తణుకు 73, కొవ్వూరు 90, నరసాపురం 98, భీమవరం 63, జంగారెడ్డి గూడెం 55, చిలకలపూడి 50.

## ద్వారకా తిరుమల

చిన్న తిరుపతిగా పిలుచుకుంటారు. ఏలూరు నుండి భీమడోలు మీదగా చేరవచ్చును. గుట్టమీద ఏడుకొండలస్వామి ఆలయం వుంది. తిరుపతికి వెళ్ళలేని భక్తులు ఇక్కడే తలనీలాలు, మొక్కుబడులు సమర్పించుకుంటారు. ఇక్కడవున్న కుంకుడు చెట్టుమీద గరుడపక్షి వాలితే ఏడుకొండలు దిగి వెంకటేశ్వరస్వామి ద్వారకా తిరుమలకి వస్తారని పురాణంలో చెప్పబడివుంది. ఆలయ సింహద్వారములు మూసినా, చీకటిగావున్నా గోపురం నుండి జ్యోతి కనపడుతుంది. దూరం నుంచి అయితే చాలా క్లియర్‌గా, దగ్గరగా అయితే చిన్న దీపంలా కనపడటానికి కారణం పర్వతంలో మణి వున్నదని అంటారు. ఇక్కడ నుంచి క్షీరారామముకు వెళ్ళుటకు సౌకర్యం వుంది. ఈ ద్వారకా తిరుమల ఏలూరు నుండి 38 కి.మీ. విజయవాడ నుంచి 105 కి.మీ. ఇక్కడి స్వామి దర్శనవేళలు ఉ. 6.00 నుండి మ. 12.00 వరకు, సాయంత్రం 3.00 నుండి రాత్రి 8.00 వరకు. శీఘ్రదర్శనము రూ. 15. శ్రీవారి దర్శనము రూ. 2/-. ఆలయంలో ఫోటోలు తీయరాదు.

## పాలకొల్లు

శ్రీ క్షీర రామలింగేశ్వరము శ్రీరామచంద్రుడు ప్రతిష్ఠించిన లింగము. ఆలయ ప్రాంగణంలో అనేక దేవతల విగ్రహాలు గలవు. ఆలయ రాజగోపురం 150 అడుగుల ఎత్తు. ఈ గోపురాన్ని క్రీ.శ. 1415లో నిర్మించారు. పంచరామాల్లో ఒకటి.

## భీమవరం

పంచారామాల్లో ఒకటి ఈ భీమారామము. 'చంద్రుడిచే ప్రతిష్ఠింప చేసిన లింగము గనుక సోమేశ్వర క్షేత్రమని పిలుస్తారు'. ఈ ఆలయంలో ఓ ప్రత్యేకత వుంది. పౌర్ణమినాడు శ్వేత వర్ణంలో కన్పించే ఈ శివలింగం క్రమక్రమంగా అమావాస్య నాటికల్లా రంగు మారిపోతుంది. ఈ మార్పులు మీరు చూడాలంటే పౌర్ణమినాడు, అమావాస్యనాడు దర్శించి చూడాలి. ఈ దేవాలయంలో లింగము చంద్రశిల అని చంద్రునిలో వచ్చే మార్పులవల్లే అలా జరుగుతోందని కొంతమంది

వాదన. ఈ ఆలయము ముందు భాగములో ఒక కోనేరు ఉంది. గట్టున రాతి స్థంభంపైన నందీశ్వరుని విగ్రహం వుంటుంది. నందీశ్వరుని నుంచి చూస్తే మనకి శివాలయంలోని లింగాకారం కన్పిస్తుంది. అదే దేవాలయం ముందు రాతిగట్టు నుంచి చూస్తే శివుని లింగానికి బదులుగా అన్నపూర్ణాదేవి కన్పిస్తుంది. కార్తీకమాసం బ్రహ్మాండమైన ఉత్సవాలు జరుగుతాయి.

## పెనుగొండ

ఆర్య వైశ్యులకు ఇలవేల్పు. శ్రీ కన్యకా పరమేశ్వరి సాక్షాత్తు పార్వతీదేవి అవతారం. కుసుమ శ్రేష్ఠి పుత్రికగా జన్మించి, పరమేశ్వరునికి అంకితం చేసిన ఈ జన్మ పరులకు అధీనం కాకూడదని ఆత్మార్పణ చేసుకున్న ఆ తల్లిని బ్రహ్మ ఇచ్చిన ఈ రెండు కనులతో చూస్తే జన్మ చరితార్థకమవుతుంది. ఇక్కడికి దగ్గరలో వున్న గ్రామమే శ్రీనాథ కవిసార్వభౌముని జన్మస్థలం.

వేములవాడ శ్రీ రాజరాజేశ్వరి స్వామి ఆలయం బహుప్రసిద్ధి. నన్నయ్యకు సరిసమాన ప్రతిభ గలిగిన వేములవాడ భీమకవి ఇక్కడివారే.

## మల్లీశ్వరము

తణుకు నుంచి 12 కి.మీ. దూరం. వశిష్ఠ గోదావరి తీరాన వుంది మల్లేశ్వరము. శ్రీ కపిల మల్లేశ్వర స్వామి ప్రతిష్ఠ బహు పురాతనమైనది. గోదావరి పొంగినప్పుడు స్వామి వారి గర్భాలయంలోకి పాతాళ గంగ పైకి వచ్చును.

## కొవ్వూరు

గోదావరి తీరంలో వున్న ఈ కొవ్వూరు నుంచి రాజమండ్రికి 7 కి.మీ. దూరం. గౌతమి మహర్షి నిర్మించిన ఆలయం వుంది.

## పట్టిసీమ

వీరభద్రస్వామి ఆలయం వుంది కొవ్వూరు నుంచి 15 కి.మీ.

# కృష్ణా జిల్లా


ఖమ్మంజిల్లా
తిరువూరు
జగ్గయ్యపేట
నందిగామ
పశ్చిమగోదావరి జిల్లా
విజయవాడ
కొల్లేరు
కైకలూరు
గుడివాడ
గుంటూరు జిల్లా
మచిలీపట్నం
కోడూరు
నాగాయలంక
బంగాళాఖాతము

# కృష్ణాజిల్లా



**చరిత్ర :** శాలంకాయనులు, విష్ణుకుండినీలు, చాళుక్యులు, బృహత్ఫలాయనులు పాలించిన జిల్లా. 1859 వరకూ మచిలీపట్నం జిల్లాగా వుంది. కృష్ణానది ప్రవహించే ఈ జిల్లా వైశాల్యం 8727. ఇందు జనాభా 36,98,000. అటవీ ప్రాంతము 663 చ.కి.మీ. లోకసభ నియోజకవర్గములు 2. శాసనసభ నియోజకవర్గములు 17.

ముఖ్యకేంద్రం మచిలీపట్నం అయిన ఈ జిల్లా 15°45 - 17°10 ఉత్తర అక్షాంశం మీద 80°00 - 81°33 తూర్పు రేఖాంశాల మధ్య కలదు.

**సరిహద్దులు :** తూర్పున బంగాళాఖాతం, పశ్చిమగోదావరి; దక్షిణాన బంగాళాఖాతం, ఉత్తరాన ఖమ్మం, పశ్చిమాన గుంటూరు, నల్గొండ జిల్లాలు వున్నాయి.

**నదులు :** కృష్ణానదితోపాటు, బుడమేరు, మునేరు, ఉప్పుటేరు, తెల్లేరు, జల్లమేరు.

**పంటలు :** వరి, జొన్న, వేరుసెనగ, చెరుకు, మామిడి, పొగాకు.

**పరిశ్రమలు :** సిమెంట్ ఫ్యాక్టరీలు, జౌళి, ఎలక్ట్రానిక్ పరిశ్రమలతోపాటు పంచదార పరిశ్రమ కూడా.

మౌర్యకాలం నుంచి జనవాసం వున్న ఈ విజయవాడ నుంచి అనేక ప్రాంతాలకి దూరం (కి.మీ.లలో) -

బందరు 70, గన్నవరం 24, గుడివాడ 54, అవనిగడ్డ 84, పామర్రు 42, తిరువూరు 103, జగ్గయ్యపేట 78.

## విజయవాడ

"శ్రీ ఓం దుర్గేస్మృతాహరసి భీతి మశేషజంతోః
స్వస్థైస్మృతామతి మతీవ శుభాందదాసి
దారిద్ర్య దుఃఖభయహారిణీ కాత్వదన్యా
సర్వోపకార కరుణాయ సదార్ద్ర చిత్తా"

ఇంద్రకీలాద్రిపై వెలిసిన అమ్మ - అమ్మలను గన్న పెద్దమ్మ కనకదుర్గమ్మ వేంచేసి వుంది. ఇక్కడే పాండవ మధ్యముడు పాశుపతాస్త్రము కోసం తపస్సు చేసి విజయం సాధించినది. అందుచేతనే ఆ విజయం పేర విజయవాడగా పిలవబడుతోంది. ప్రతి పన్నెండు సంవత్సరాలకి కృష్ణాపుష్కరములు జరుగుతాయి. ఈ తల్లిని అగస్త్యాది మహర్షులు, పరశురామ, శ్రీరామ, శ్రీకృష్ణాది అవతార పురుషులతోపాటు దేవరాయలాది రాజులు, అర్చించి అభీష్ట సిద్ధులు పొందారు. ఇక్కడే అమ్మవారి రౌద్రరూపం శాంతింపచేయటానికి జగద్గురు ఆదిశంకరా చార్యులు శ్రీచక్ర ప్రతిష్ఠ గావించారు. ఈమె సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరునికి సోదరి. అమ్మవారిని, శ్రీమల్లేశ్వరాలయం దర్శించి మెట్లు దిగితే క్రొత్త గుళ్ళు వస్తాయి. ఈ దేవాలయాలను తప్పనిసరిగా దర్శించండి. బందరురోడ్డులో, ఆంధ్రజ్యోతికి ఇవతల రోడ్డులో వేంకటేశ్వరస్వామి ఆలయం వుంది. గొల్లపూడిలో అయ్యప్పస్వామి ఆలయం దర్శించి శబరిమల వెళ్ళిన ఫలం పొందండి.

ఈ మధ్యనే నిర్మించిన రాజీవ్‌గాంధీ పార్క్ మీ ప్రయాణ బడిలికను తగ్గిస్తుంది. మైసూర్ బృందావన్ గార్డెన్స్‌లో మాదిరి మ్యూజికల్ వాటర్ ఫౌంటెన్ ఇచ్చట ముఖ్య ఆకర్షణ.

కృష్ణానదిలో బోటు విహారానికి సాయంత్రం నాలుగులోపు కృష్ణవేణి మోటెల్‌కి వెళ్ళండి. సుందర భవానీ ఐలాండ్స్‌లో సేద తీరండి. ఈ కృష్ణవేణి మోటెల్ నుండి అమరావతికి బోటు సౌకర్యం వుంది.

## మోపిదేవి

సుబ్రహ్మణ్యేశ్వరాలయం....., కోరిన కోర్కెలు తీర్చే ఈ ఆలయం ప్రక్కనే సకలేశ్వరాయములోని లింగము పాతాళము వరకు వున్నదని స్థలపురాణంలో చెప్పబడినది.

## హంసలదీవి

వేణుగోపాలస్వామివారి ఆలయం గల హంసలదీవిలోనే కృష్ణానది సాగరసంగమం అవుతుంది. విజయవాడ నుంచి 90 కి.మీ. దూరం.

## వేదాద్రి

కృష్ణాతీరంలో వున్న ఈ క్షేత్రము నదీ గర్భాన లింగాకారంలో నృసింహస్వామి వుంటారు. నీటిలో దిగటానికి మెట్లు వున్నాయి. విజయవాడ-హైదరాబాద్ రూటులో వున్న జగ్గయ్య పేట నుంచి వేదాద్రికి బస్సులో వెళ్ళవచ్చు.

## కొల్లేరు

చక్కటి పక్షులను చూడవచ్చు. విజయవాడ నుంచి 94 కి.మీ.

## మంగినపూడి బీచ్

సముద్రతీర ప్రాంతం అనేకమంది ఇక్కడికి వచ్చి ఉల్లాసంగా గడిపిపోతారు.

## కొండపల్లి

కొండవీటి రాజుల కోట వుంది. ఇక్కడ తయారుచేసిన బొమ్మలు అంతర్జాతీయ 'కొండపల్లి బొమ్మలు'గా ఖ్యాతిని పొందాయి.

# గుంటూరు జిల్లా



**చరిత్ర** : ఈ జిల్లాలో 1364 దేవాలయాలున్నట్లు తెలుస్తుంది. ఈ జిల్లాలో బౌద్ధమత ప్రాభల్యం క్రీస్తుపూర్వము నుంచి వుంది పల్లవులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, చోళులు, గజపతులు పాలించిన ఈ జిల్లా **వైశాల్యం** 11,391 చ.కి.మీ **ఇందు జనాభా** 41,06,000. **అడవులు** 1561 చ.కి.మీ.. **లోక్‌సభ నియోజకవర్గములు** 4 **శాసనసభ నియోజకవర్గములు** 19.

కృష్ణానదికి దక్షిణ తీర భాగంలో వున్న ఈ జిల్లా 15'46 16 50 ఉత్తర అక్షాంశ రేఖపై 78 10 - 80 55 తూర్పురేఖాంశంపై వున్నది.

**సరిహద్దులు** : దక్షిణ, పశ్చిమాన ప్రకాశం, తూర్పున బంగాళాఖాతంతోపాటు కృష్ణాజిల్లా సరిహద్దులున్నాయి.

**పరిశ్రమలు** : శ్రేన్ వక్కపొడి సంస్థ ఇక్కడిదే. సిమెంట్, పంచదార, ఎరువుల మందులు.

**నదులు** : గుండ్లకమ్మ, నాగులేరు, కృష్ణ.

**పంటలు** : పొగాకు, ప్రత్తి, మిరప, వేరుశెనగ.

ఈ జిల్లా ముఖ్యకేంద్రం గుంటూరు నుంచి అనేక ప్రాంతాలకి దూరం (కి.మీ.లలో) అమరావతి 36, పొన్నూరు 30, బాపట్ల 53, రేపల్లె 67, తెనాలి 27, సత్తెనపల్లి 39, నర్సరావుపేట 47, పిడుగురాళ్ళ 72.

**ఎన్నో వేల సంవత్సరాల క్రితమే అస్పృశ్యతకు వ్యతిరేకముగా సహ పంక్తి భోజనములు చేపట్టిన ఈ ప్రదేశాన పుణ్యవిహారస్థలాలు.....**

## గుంటూరు

ఆర్. అగ్రహారంలో ప్రసిద్ధి చెందిన రామనామక్షేత్రం ఉంది. కొత్తపేటలో అంజనేయస్వామి వారి ఆలయం. ఇంకా శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయం, శ్రీ కుసుమ హరనాథాలయం ఉన్నాయి.

**మాచర్ల శ్రీ చెన్న కేశవాలయము :** చంద్రవంక నదీతీరాన ఉంది, శ్రీ చెన్నకేశవ ఆలయం. ఈ ఆలయానికి ఎడమవైపుగా శ్రీ వీరభద్రస్వామి, భద్రకాళి విగ్రహం, శనీశ్వర విగ్రహం ఉన్నాయి. పక్కగా శ్రీ కామేశ్వరీ దేవాలయం ఉంది.

## అమరావతి

ఇచ్చటకు ప్రతి అరగంటకు బస్సులున్నాయి గుంటూరుకి 27 కి.మీ. దూరంలో ఉంది. కృష్ణానదీ తీరమున వున్న ఈ క్షేత్రం పెద్ద క్షేత్రముగా విశేషమైన పేరుగాంచి ఉంది. అమరేశ్వరాలయంలో అమరేశ్వరస్వామి, దేవేరి రాజ్యలక్ష్మి అమ్మవారు అయిదు ప్రాకారాల మధ్య వేంచేసి ఉంటారు. పదిహేను అడుగుల ఎత్తున లింగము మూడు అడుగుల కైవారంతో ఏనుగు దంతం రంగుతో ఉంటుంది.

ఇచ్చటి శివలింగము దినదినం పెరుగుతుండటంతో ఏంచేయాలో తెలీక నడినెత్తిన మేకు కొట్టారని, అంతటితో ఆగిందని దానికి గుర్తుగా లింగం నడినెత్తిపైన మేకు కొట్టినప్పుడు కారిన రక్తం ధారల చారలు గమనించవచ్చు. శ్రీ స్వామి వారికి అభిషేకాలు చేయాలన్నా పైకి వెళ్ళే చేస్తారు. ఇక్కడ మ్యూజియంలో శిల్పాలు చూస్తే, అమరావతికి గత వైభవం కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది. వసతికి గవర్నమెంట్ టూరిస్ట్ రెస్ట్ హౌస్ ఉంది.

## ఎత్తిపోతల జలపాతం

మాచెర్ల నుంచి 8 కి.మీ. దూరం. నీరు 20 మీటర్ల ఎత్తులోంచి పడుతుంది.

## పొన్నూరు

గుంటూరు నుంచి 25 కి.మీ. దూరం. ఈ పట్టణంలో ప్రసిద్ధి చెందిన శ్రీ భావనారాయణస్వామి దేవాలయం ఉంది. ఈ స్వామిని శ్రీ సాక్షి భావనారాయణస్వామి అని కూడా అంటారు. ఈ దేవాలయ ప్రాంగణమున శ్రీరాజ్యలక్ష్మి అమ్మవారి దేవాలయం శ్రీకాశీ విశ్వేశ్వరాలయము, శ్రీకాశీ విశాలాక్షి దేవాలయము వెలిశాయి.

ఈ పొన్నూరులోనే, శ్రీ సహస్ర లింగేశ్వరస్వామి దేవస్థానము ఉంది. ఈ ఆలయాన్ని 1939లో నిర్మించారు. ఇక్కడే 1961లో శ్రీ వీరాంజనేయస్వామి శ్రీ పెద్ద గరుత్మంతస్వామి విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. ఈ విగ్రహాలు ఏకశిలా విగ్రహములై 24 అడుగుల ఎత్తుతో వీరాంజనేయస్వామి, 30 అడుగుల ఎత్తుతో శ్రీ పెద్ద గరుత్మంత స్వామీ నయనానందకరంగా అగుపిస్తారు.

## ధరణికోట

ధాన్యకటమునే శాతవాహనుల రాజధాని బౌద్ధవిద్యాలయం వుంది.

## వైకుంఠపురం

అమరావతి నుంచి 6 కి.మీ. దూరంలో పవిత్ర కృష్ణానది తీరాన కొండమీద శ్రీ వేంకటేశ్వరుడు కొలువు తీరివుంటాడు. ఇచ్చట నుండి వర్షాకాలంలో విజయవాడకు లాంచీల మీద వెళ్ళవచ్చు.

## పెదకాకాని

గుంటూరు నుంచి ఆటోలోకూడా వెళ్ళేయ అంతదగ్గర సాంబ శివాలయం కోరిన కోర్కెల సాంబశివుడు సాఫల్యం చేస్తాడని భక్తకోటి అపారనమ్మకం. ఈ

స్వామి శ్రీశైల లింగాంశము కలిగియుండుటచే ద్వాదశ జ్యోతిర్లింగముల యందలి మహిమ ఇందు నెలకొని వుంది. ఈ దేవాలయ ప్రాంగణంలో భరద్వాజునిచే నిర్మింపబడిన రూపము కలదు. ఇందు సమస్త తీర్థములను నిక్షిప్తము చేశారు.

## ఉండవల్లి

విజయవాడ బ్యారేజి నుంచి 2 కి.మీ. కృష్ణానది ఒడ్డున వుంది. ఈ ఉండవల్లి గుహలు ప్రఖ్యాతి చెందినవి.

## మంగళగిరి

రాత్రి సమయాల్లో దేవతలు అర్చనలు జరుపుతారని ప్రతీతి. కొండమీద స్వామి వారిని సేవించడానికి మధ్యాహ్నం వరకే అవకాశం ఉంది. స్వామివారికి నివేదనలలో ప్రధానమైనది బెల్లపు పానకం. శ్రీ నృసింహస్వామి హిరణ్యకశిపుని సంహారం చేయటానికి స్తంభం నుంచి ఉద్భవించి, ఆ రాక్షసుని తొడలపై వేసికొని, పొట్టచీల్చి పేగులను మెడలో ధరించి భీకరంగా వుండగా, సర్వదేవతలు శాంతించమని వేడుకున్నారు. ఆయన శాంతించలేదు. శ్రీలక్ష్మీదేవి కొండమీద తపస్సు చేసి స్వామివారికి పానకం నివేదించింది. దాన్ని స్వీకరించి శాంతించారు. లక్ష్మీదేవి తపస్సు చేయుటంవల్ల మంగళగిరి అనే పేరు వచ్చింది. శ్రీపానకాల లక్ష్మీ నృసింహస్వామి దేవాలయ గర్భగుడిలో భక్తప్రహ్లాద, లీలావతిదేవి విగ్రహాలు వున్నాయి. ఎన్నో ప్రత్యేకతలు వున్న ఈ క్షేత్రంలో సౌకర్యాల దృష్ట్యా కొన్ని లోపాలున్నాయి.

## మాచెర్ల

శ్రీ చెన్న కేశవాలయము ఉంది. చంద్రవంక నదీతీరమునున్న ఆలయంలో ఐదు తలల నాగ ప్రతిమ తెల్ల పాలరాతితో చేయబడినది ఉంది. ఇక్కడున్న శ్రీకృష్ణుని విగ్రహ ప్రతిష్ఠ బ్రహ్మనాయకుడు చేశాడు. గర్భగుడి దగ్గరలో నాలుగు స్థంభాల మండపంలోని శిల్పసౌందర్యం మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది.

# ప్రకాశం జిల్లా



చరిత్ర : మొట్టమొదటి తెలుగు శాసనం లభించినది ఈ జిల్లాలోనే. రెడ్డిరాజుల కాలంలో ప్రసిద్ధి చెందిన అద్దంకి ఈ జిల్లాలోనిదే. శాతవాహనులు, ఇక్ష్వాకులు, కర్నాటక నవాబులు పాలించిన ఈ జిల్లాని 1978వ సంవత్సరంలో ప్రకాశంజిల్లాగా మార్చారు.

ఒంగోలు జిల్లాగా ఒకప్పుడు పిలవబడే నేటి ప్రకాశంజిల్లా 14°58 - 16°17 ఉత్తర అక్షాంశ రేఖలకు, 78°45 - 80°40 తూర్పు రేఖాంశాల మధ్య వుంది.

జిల్లా ముఖ్యకేంద్రం ఒంగోలు. ఈ జిల్లా వైశాల్యం 17,626 కి.మీ.

ఇందు జనాభా 27,59,000. అటవీ ప్రాంతం 21.15%. ఒక లోకసభ నియోజక వర్గం మరియు 7 శాసనసభ నియోజక వర్గాలు కలిగి వుంది.

పరిహద్దులు : ఉత్తరము వైపు గుంటూరుజిల్లా, తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన నెల్లూరు, పశ్చిమాన కర్నూలు.

నదులు : మూసి; గుండ్లకమ్మ, పాలేరు.

పరిశ్రమలు : పాల ఉత్పత్తులు, పురుగు మందులు, స్పిన్నింగ్ మిల్స్.

పంటలు : పప్పులు, వరి, ప్రత్తి, రాగులు, వేరుశెనగ, మిరప.

క్రీ.శ. 1324లో ప్రోలయ వేమారెడ్డి పాలించాడు. అతని ఆస్థాన కవి ఎఱ్ఱాప్రెగడ. అలాంటి ప్రసిద్ధి ప్రాంతమైన నేటి ప్రకాశం జిల్లా ఒంగోలు నుంచి అనేక ప్రాంతాలకి దూరం (కి.మీ.లలో) : గిద్దలూరు 150, కంభం 107, చీరాల 57, అద్దంకి 40. మేదరమెట్ల 29, సింగరాయకొండ 32, పొదిలి 47, కందుకూరు 45, కనిగిరి 80.

మణికేశ్వరం : చోళరాజుచె నిర్మించిన మంతాకేశ్వరస్వామి ఆలయం వుంది ఒంగోలు నుంచి 32 కి.మీ. దూరం.

సింగరాయకొండ : ప్రసన్నాంజనేయస్వామి ఆలయం వుంది. కొండ మీద నృశింహాస్వామి దేవాలం 'ం వుంది.

మాలకొండ : బ్రహ్మాండమైన అడవుల మధ్య కందుకూరు నుంచి 30 కి.మీ దూరంలో శ్రీ లక్ష్మీనరశింహాస్వామి ఆలయం వుంది

కంభం : విజయనగరం కాలంనాటి చెరువు వుంది. ఇక్కడ అనేక శిలాశాసనాలున్నాయి.

భార్గవకొండ : అష్టముఖ దుర్గా భైరవస్వాముల ఆలయం వుంది. జలపాతంతోపాటు ఏకశిలపై చెక్కిన దేవతామూర్తుల శిల్పం వుంది.

మార్కాపురం : చెన్నకేశవస్వామి ఆలయం వుంది. ఉత్తరాయణంలో సూర్యకాంతి స్వామి పాదాలపై పడి తిరిగి దక్షిణాయనంలో మహాలక్ష్మి పాదాలపై పడటం విశేషం.

చీరాల : చేనేత వస్త్రాలకు ప్రసిద్ధి.

ఒంగోలు : ఇక్కడ మంచి దీటైన గిత్తలు లభిస్తాయి. అందుకే అంటారు కాస్త లావు అయితే 'ఒంగోలు గిత్తలా వుంటావ్' అని ఇక్కడ గిత్తలని బట్టే! ఆ ఉపమానాలంకారము పుట్టినది.

# నెల్లూరు జిల్లా


ప్రకాశం జిల్లా
కావలి
పెన్నా
ఆత్మకూరు
నెల్లూరు
కడప జిల్లా
గూడూరు
బంగాళాఖాతము
వెంకటగిరి
నాయుడుపేట
చిత్తూరు జిల్లా
తమిళనాడు

# నెల్లూరుజిల్లా



చరిత్ర : ఒకప్పుడు విక్రమ సింహపురి అని పిలువబడిన ఈ ప్రాంతం చాళుక్యులు, కాకతీయులు, గోల్కొండ నవాబులతోపాటు పల్లవులు కూడా పాలించారు.

1892లో ఏర్పడ్డ ఈ జిల్లా 13°31 - 15°51 ఉత్తర అక్షాంశం రేఖలకు 79°15 80°15 తూర్పు రేఖాంశముల మధ్య వుంది.

దీని జనాభా 23,92,000.

వైశాల్యం 13,076. అటవీ ప్రాంతం 19%.

దక్షిణ కోస్తా చివరి జిల్లా అయిన ఈ నెల్లూరు జిల్లా సరిహద్దులు : ఉత్తరాన ప్రకాశం, పశ్చిమాన కడప, దక్షిణాన తమిళనాడు, చిత్తూరు తూర్పున బంగాళాఖాతం వున్నాయి.

నదులు : కండలేరు, పెన్నా, పిలపేరు, కండలేరు, ఉప్పుటేరు.

పంటలు : సజ్జలు, రాగులు, మిరప, వేరుశెనగ, కాయగూరలు, వరి

పరిశ్రమలు : పేపరు, ఫ్యాక్టరీలు, చేనేత రసాయనములు, ఆక్వా.



శ్రీ తల్పగిరి రంగనాథస్వామి దేవస్థానము.... నెల్లూరు



ఈ జిల్లా ముఖ్య కేంద్రమయిన నెల్లూరు నుంచి వివిధ ప్రదేశాలకి దూరం (కి.మీ.లలో) : శ్రీహరికోట 120, రాపూరు 59, వెంకటగిరి 89, గూడూరు 38, సూళ్ళూరుపేట 100, తడ 113, ఆత్మకూరు 52, కావలి 53, పొదలకూరు 35

800 సంవత్సరాల నాటి దేవాలయం వున్న ఈ నెల్లూరు జిల్లాలోని యాత్రా ప్రదేశాలు విహారస్థలాలు :

# నెల్లూరు

ప్రాచీనమైన సింహపురి గ్రామ దేవత ఇరుకలు మహేశ్వరి (ఇరుగాలమ్మ) పట్టణంలో పడమటి దిశన ఉంది. శ్రీరంగనాథాలయం శ్రీరంగనాయకస్వామిని దర్శించవచ్చు. నెల్లూరు నుంచి గూడూరు వెళ్ళేదారిలో నెల్లూరు ఎంట్రన్స్‌లో అయ్యప్పస్వామి ఆలయం ఉంది. తప్పనిసరిగా దర్శించదగ్గ ముఖ్యమైనది. పెన్నానది ఒడ్డున కవి తిక్కన మహాభారతాన్ని రాసిన ప్రదేశం చూడవచ్చు. కాని ఆ ప్రదేశం.

## పెంచల కోన

నెల్లూరు నుంచి 50 కి.మీ. దూరం, గూడూరు నుంచి 40 కి.మీ., గోనుపల్లి అనే గ్రామానికి 6 కి.మీ. దూరంలో ఉంది. ఈ స్వామివారు 'స్వయంభూ' పెనుశిలయనగా - పెద్ద శిల అని, పెనవేసుకున్నందున 'పెనుశిల' అంటారు. నవనారసింహులలో ఒకరు స్వామి. ఈ ప్రదేశమే కణ్వమహర్షి నివశించినది. చుట్టూ కొండలు, చక్కటి ప్రకృతితో అలరారుతోంది ఈ క్షేత్రం.

## జొన్నవాడ

నెల్లూరుకు 25 కి.మీ. దూరంలో ఉంది. ఇక్కడ కామాక్షి దేవి దేవాలయం ఉంది. ఈ దేవి అనుగ్రహమున సంతానప్రాప్తి, దీర్ఘరోగ నివారణ, గ్రహబాధ నివృత్తి ఎందరికో కలిగాయి. తిక్కన ఇక్కడ యజ్ఞం చేసి సోమయాజి అయ్యాడు. ఆలయానికి చుట్టు పక్కల అనేక శధిల ఆలయాలున్నాయి.

**శ్రీహరికోట :** రాకెట్ ప్రయోగ కేంద్రం. సూళ్లూరుపేట నుండి దగ్గర.

**ఉదయగిరి :** విజయనగర రాజులు 14వ శతాబ్దంలో నిర్మించిన కోట ఉంది. ఉదయగిరి కొండపై అనేక దివ్య ఔషధాలున్నాయి. ఆ మొక్కల కోసం చాలా మంది వస్తారు.

**వెంకటగిరి :** స్త్రీల అందరికీ ప్రీతిపాత్రమైన వెంకటగిరి చేనేత చీరలు ఇక్కడే నేస్తారు.

# కర్నూలు జిల్లా



చరిత్ర : రేనాటి చోళులు, కాకతీయులు, మొగలాయిలు, గోల్కొండ నవాబులు, కాకతీయులు పాలించిన ప్రాంతమే నేటి కర్నూలుజిల్లా. హైదరాబాద్‌కు ముందు ఆంధ్రప్రదేశ్ రాజధాని ఈ కర్నూలు జిల్లా.

ఈ జిల్లా ముఖ్య కేంద్రం కర్నూలు.

వైశాల్యం : 17,658 చ.కి.మీ.

జనాభా : 29,73,000.

అటవీ ప్రాంతం : 19%.

రెండు లోక్‌సభ నియోజకవర్గాలు, పదమూడు శాసనసభ నియోజకవర్గాలు గల ఈ జిల్లా 14°24 - 16°11 తూర్పు అక్షాంశరేఖ, 75'50 - 78'25 ఉత్తర రేఖాంశములు మధ్య వుంది.

పరిహద్దులు : ఉత్తరం వైపు మహబూబ్‌నగర్, పడమటలో కర్నాటక, దక్షిణాన అనంతపురంతోపాటు కడప జిల్లాలు, తూర్పున ప్రకాశంజిల్లా.

నదులు : హంద్రి, కుందేరు, తుంగభద్ర, పాలేరు, గుండ్లేరు, ముని మదుగులేరు.

పంటలు : సజ్జ, వరి, జొన్న, కొర్ర, వేరుశెనగ.



శ్రీ నరసింహస్వామి దేవాలయము
అహోబిలం



శ్రీ మహానందీశ్వర దేవాలయము : మహానంది

పరిశ్రమలు : నూనెలు, సిమెంట్, పేపర్.

యావత్ భారతదేశంలోని శైవ క్షేత్రాల్లో ముఖ్యమైన శ్రీశైలం గల ఈ జిల్లా ముఖ్యకేంద్రం కర్నూలు నుంచి అనేక ప్రాంతాలకు దూరం (కి.మీ.లలో) : శ్రీశైలం 180, ద్రోణాచలం 50, అదోని 100, ఎమ్మిగనూరు 70, బనగానపల్లె 88, మహానంది 94, ఆత్మకూరు 70, నందికొట్కూర్ 29, సంగమేశ్వరం 56.

**ఈ కర్నూలు జిల్లాలో చూడదగ్గ విహార స్థలాలు, యాత్రా ప్రదేశాలు :**

**అహోబిలం :** సముద్రమట్టానికి 610 మీటర్ల ఎత్తున వున్న ఈ క్షేత్రంలో నవనరసింహుల వారు వుంటారు. ఇక్కడ అపురూప శిల్పాలున్నాయి. కొండ క్రింద లక్ష్మీనరసింహ ఆలయం వుంది.

**మాధవరం :** చూడదగ్గ కళాతోరణం.

**మహానంది :** నంద్యాల నుంచి 15 కి.మీ. దూరంలో వుంది. బ్రహ్మాండమైన నల్లమల అడవులు మనల్ని ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. గాజులపల్లి నుంచి 6 కి.మీ. ఇక్కడి నవనందుల్ని చూడండి.

## శ్రీశైలము (శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే)

కర్నూలు నుంచి 180 కి.మీ. దూరంలోగల ఈ పురాణ ప్రసిద్ధమైన - ఈ క్షేత్రంలోని శ్రీశైల భ్రమరాంబికా మల్లికార్జునస్వామి వారు వేంచేసి ఉంటారు. ఎక్కడాలేని విధంగా ఇక్కడ స్వామిని చేతులతో తాకి పునర్జన్మ లేకుండా ముక్తిని పొందవచ్చు. ఇంతటి మహత్తుగల పుణ్యక్షేత్రం ద్వాదశ జ్యోతిర్లింగములలో మొట్టమొదటిది. సముద్రమట్టానికి 1500 అడుగుల ఎత్తులో వున్న ఈ అనాదిక్షేత్రమును శ్రీరామచంద్రుడు బ్రహ్మహత్యాపాతక విముక్తికై ప్రదక్షిణ చేశారు. ఆలయదర్శన వేళలు మ॥ 1.15 నుండి 3.30 వరకూ మరియు రాత్రి 9.00ల నుండి 10.00ల వరకూ ఉచిత దర్శనం కలదు. శ్రీ భ్రమరాంబికాలయం**తోపాటు** ఎడమవైపున పార్వతీదేవి ఆలయం ఉంది. ఆంధ్రుల గర్వకారణమైన ఈ శ్రీశైలంలో దర్శనీయ స్థలాలు.



శ్రీశైల దేవస్థానము





# శ్రీ భ్రమరాంబ మల్లిఖార్జున దేవస్థానము

1) సహస్ర లింగాలయము 2) చంద్ర కుండము 3) వృద్ధ మల్లిఖార్జునస్వామి 4) రుద్రాక్ష మంటపము 5) సారంగ మంటపము 6) పంచాక్షరీ మంటపము 7) గోగర్భం 8) ఘంటామఠము 9) ఏనుగుల చెరువు 10) పాతాళగంగ 11) లింగాలగట్టు 12) నృసింహబిలము.

## మంత్రాలయము

పవిత్ర తుంగభద్రానదీ తీరాన వుంది ఈ క్షేత్రం. ఆదోని నుంచి 57 కి.మీ.

శ్రీ మంత్రాలయ రాఘవేంద్రస్వామి వారు ఇక్కడే జీవసమాధి పొందారు. స్వామి వారిని దర్శించే ముందు గ్రామదేవతయైన మంచాలమ్మను దర్శించండి అది స్వామి అభీష్టం. భాద్రపద మాసంలో గొప్ప ఉత్సవం జరుగుతుంది. APTTDC టూరిస్ట్ రెస్ట్‌హౌస్‌లో దిగవచ్చు.

సంగమేశ్వరం: సప్తనది సంగమం. ముక్తిక్షేత్రమని పేరు. ధర్మరాజు ప్రతిష్ఠించిన విగ్రహం వుంది.



# అనంతపురం జిల్లా



చరిత్ర : 1981, 82లో బళ్ళారి జిల్లాను విడదీసి అనంతపురం జిల్లాగా మార్చారు. మౌర్యులు, పల్లవులు, రాష్ట్ర కూటులతోపాటు మొగలాయులు, హైదరాలి వంటి మైసూర్ రాజులు పాలించిన ప్రాంతం. ఈ జిల్లాలో లేపాక్షి, వజ్రకరూర్ లాంటి చారిత్రాత్మక ప్రదేశాలున్నాయి. శిలాయుగపు నాటి పరికరములో అనేకం ఈ జిల్లాలోనే బయటపడ్డాయి.

అనంతపురం ఈ జిల్లా ముఖ్య కేంద్రం. ఈ జిల్లా 13°40' - 15°15' ఉత్తర అక్షాంశాలు, 76°50 - 78°30' తూర్పు రేఖాంశముల మధ్యవుంది.

పరిహద్దులు : ఉత్తరాన కర్నూలుజిల్లా, దక్షిణాన చిత్తూరుజిల్లా, తూర్పున కడపజిల్లా, పశ్చిమాన కర్నాటక రాష్ట్రం.

శాసనసభా నియోజకవర్గములు 14.

అటవీ ప్రాంతం 10%.

వైశాల్యం : 19,130 చ.కి.మీ. లోక్‌సభ నియోజకవర్గములు 2.

ఇందు జనాభా 31,83,000.

పరిశ్రమలు : పంచదార, జౌళి.

నదులు : చిత్రావతి, పాపాగ్ని, పెన్నా.

పంటలు : కొర్రి, వేరుశెనగ, పట్టు పరిశ్రమ.

విజయనగర రాజులు కట్టించిన ఏదో ఒక కాలములో దేవాలయమో ఈ జిల్లాలో కనపడతాయి. అలాంటి ఈ జిల్లా కేంద్రం కర్నూలు నుంచి వివిధ ప్రాంతాలకి దూరం (కి.మీ.లలో) : రాయదుర్గం - 86, ధర్మవరం - 46, పుట్టపర్తి - 96, హిందూపురం - 114, మడకసిర - 111, కదిరి - 113, ఉరవకొండ - 53.

తిరుమల తిరుపతి దేవాలయము పోలిన శిథిలాలయం గల ఈ జిల్లాలో దర్శనీయ స్థలాలు, విహార ప్రదేశాలు -

గుత్తి : కొండపై కోట వుంది. అనంతపురం నుంచి 50 కి.మీ. దూరంలో వుంది ఈ చారిత్రాత్మకమైన ప్రదేశం.

పెనుగొండ : విజయనగర రాజులచే నిర్మించిన కోటతోపాటు అనేక దేవాలయాలు వున్నాయి. అనంతపురాన్నుంచి 50 కి.మీ. దూరం.

పుట్టపర్తి : సత్యసాయి బాబా నిలయం వున్నది ఇక్కడే. అనంతపురాన్నించి 59 కి.మీ.

రాయదుర్గం : ఇక్కడ తిరుమల ఆలయాన్ని పోలిన శిథిలాలు వున్నాయి. ఇక్కడి దేవాలయ శిఖరం చందనంచే తయారుచేశారు.

లేపాక్షి : 16వ శతాబ్దపు అందమైన చిత్రాలు ఇక్కడ చూడొచ్చు. ఆలయ శిఖరం గాలిలో వుంటుంది. ఈ ప్రాంతంలోనే 20 అడుగుల ఎత్తు, 30 అడుగుల పొడవు కలిగిన నంది వుంది.



# కడప జిల్లా



**చరిత్ర :** జిల్లా ముఖ్యకేంద్రము కడప. ఒకప్పుడు కరిపె అనే పేరే నేటి కడప. శాతవాహనులు, చోళులు, కాకతీయులు, గోల్కొండ నవాబులు, విజయనగర రాజులు పాలించిన ప్రాంతం.

1797లో ఏర్పడిన ఈ జిల్లా ఆపై 1807 నుండి అభివృద్ధి చెందింది. ఆపై 1812లో కతప జిల్లా కేంద్రముగా మారింది.

జిల్లా ప్రధాన కేంద్రం కడప. ఈ జిల్లా 13°43'-15°14' ఉత్తర అక్షాంశములు 77°85' – 79°29' తూర్పు రేఖాంశముల మధ్య వుంది.

**పరిహద్దులు :** ఉత్తరాన కర్నూలు జిల్లా, ప్రకాశంజిల్లా. పశ్చిమాన అనంతపురం దక్షిణాన చిత్తూరు, తూర్పున నెల్లూరు జిల్లాలు.

**వైశాల్యం :** 15,359 చ.కి.మీ.

**అటవీ ప్రాంతం : 33%**

ఇందు జనాభా 26,67,000. లోక్‌సభ నియోజకవర్గములు 2, శాసనసభ నియోజక వర్గములు 11.

**నదులు :** బహుదా, పింఛ, పన్నేరు, మండలి, పుల్లంగి, గుంజన.

ప్రధాన పంటలు : కొర్రలు, వరి, వేరుశెనగ

ముఖ్యపరిశ్రమలు : జౌళి, ఎరువులు, సిమెంట్.

పుష్పగిరి, ముక్తిరామేశ్వరం, బ్రహ్మంగారి మఠంలాంటి అనేక పుణ్యప్రదేశాలు గల ఈ జిల్లా ప్రధాన కేంద్రం కడప నుండి అనేక ప్రాంతాలకు దూరం కి.మీ.లలో - ప్రొద్దుటూరు 56, జమ్మలమడుగు 77, బ్రహ్మంగారి మఠం 49, పోరుమామిళ్ళ 60, రాజంపేట 73.

చాళుక్యుల జన్మస్థలమైన ఈ కడప జిల్లాలో దర్శనీయ స్థలాలు -

కడపలో శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర దేవాలయం వుంది. కడప నుంచి 2 కి.మీ. దూరం ఈ క్షేత్రం. అతి ప్రాచీనమైనది. ఇక్కడ వున్న శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర దర్శనాంతరము తిరుమలేశుని దర్శిస్తారు భక్తులు. కృపాచార్యులు ప్రతిష్ఠించినట్లు స్థల మహత్యములో తెలుస్తుంది. వేంకటేశ్వరస్వామి వెనుక ఆంజనేయస్వామి విగ్రహం వుంది.

తాళ్ళపాక : పద కవితా పితామహుడు అన్నమాచార్యుడు 1408-1424 మధ్యన తన మధుర గీతాలతో ఆ స్వామిని ప్రసన్నం చేసుకొన్న మహనీయుడు తాళ్ళపాక అన్నమాచార్యుడు ఈ వూరి వాడే.

ఒంటిమిట్ట : ఏకశిలా నగరమని ఈ క్షేత్రమునకు ప్రసిద్ధ నామము వుంది. ఇక్కడ శ్రీ కోదండ రామస్వామిని జాంబవంతుడు ప్రతిష్ఠించాడు. ఏకరాయిలో శ్రీరాముడు, లక్ష్మణుడు, సీతను చూడవచ్చు. ఇక్కడ రామతీర్థముంది. శ్రీరాముడు, సీత కోరికపై రామబాణంతో పాతాళగంగను పైకి తెచ్చాడని స్థల పురాణం. గోపుర నిర్మాణం చోళ శిల్ప సాంప్రదాయంలో కన్పిస్తుంది.

శ్రీ అగస్త్యేశ్వర దేవస్థానము : చోళరాజు నందవర్మ గర్భాలయాన్ని నిర్మించాడు. అగస్త్య మహర్షి స్వామిని ప్రతిష్ఠించడంతో ఆ పేరుతో పిలుస్తారు

గండిక్షేత్రం : హనుమంతుడు ఈ గండి క్షేత్రములో రెండు కొండల



నడుమన బంగారు తోరణం కట్టి శ్రీరామచంద్రుడని ఆహ్వానించిన క్షేత్రమిదే. ఈ తోరణం కనిపిస్తే 6 నెలలో దివంగతులు అవుతారు.

**పుష్పగిరి క్షేత్రం** : పినాకిని నదీతీరంలో వున్న ఈ క్షేత్రం దక్షిణకాశిగా పిలుస్తారు. సంతానం లేని వారు ఇక్కడున్న గిరి ప్రదేశం చూస్తే సంతానవంతు లవుతారని నమ్మకం.

**సంగమేశ్వర దేవాలయం** : కడపజిల్లాలో కమలాపురం తాలూకాలో వున్న అనిమెలలో ఉంది ఈ దేవాలయం. ఈ గుడిలో ఈశ్వరునికి ఎదురుగా నల్లరాతితో పాతవైన నందివిగ్రహం ఉంది. వైశాఖ శుద్ధపౌర్ణమి తిరునాళ్ళు జరుగుతాయి.

**ముక్తిరామేశ్వరం** : ప్రొద్దుటూరు నుండి 6 కి.మీ. దూరం. ఇచ్చట ఈశ్వరలింగము సైకతలింగము నేలకి 5 అంగుళాల ఎత్తునవున్న లింగముపై ఇసుకను అదిమి పెట్టిన వేలిముద్రలు ఇప్పటికీ అగుపిస్తాయి. ఇంకా ఈ కడపజిల్లాలో శ్రీ శ్రాత్రితేశ్వరస్వామి (హత్యరాల), శ్రీ వీరభద్రస్వామి (అల్లాడపల్లె), శ్రీహరిహరాదుల ఆలయం (వీరబల్లె), గండిక్షేత్రం, శ్రీ పుష్పగిరి క్షేత్రములు కలవు.

**శ్రీ నారాపుర వేంకటేశ్వరస్వామి :** కడప జిల్లాలోని జమ్మలమడుగు పట్టణంలో శతాబ్దాల చరిత్ర కలిగిన వేంకటేశ్వర స్వామి ఆలయం ఉంది. నారాపురుడనే భక్తుడు నిర్మించటంతో ఆ పేరుతో పిలుస్తారు. ఉత్తరదిశగా ఇసుకతిన్నెల్లో నిర్మించిన ఈ ఆలయం తప్పనిసరిగా దర్శించదగ్గది.

## శ్రీ బ్రహ్మంగారి మఠము

16వ శతాబ్ది ప్రాంతమువారు అయిన శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారు కాలజ్ఞాన తత్త్వాన్ని పామరులకి కూడా అర్థమయ్యే భాషలో వ్రాశారు. భూత, వర్తమాన భవిష్యత్తు కాలాన్ని కళ్ళకు కట్టినట్టు చెప్పిన స్వామి 1594 మే నెలలో జీవ సమాధిని పొందారు. అదే శ్రీ బ్రహ్మంగారి మఠము. చుట్టూ నల్లమల అడవులు. రమణీయమైన ప్రకృతి, అద్భుతమైన శైలుమార్గం. బస్సులో అయితే బద్వేలు మీదుగా వెళ్ళాలి. గిద్దలూరు నుంచి వచ్చేవారు మల్లేపల్లి దగ్గర దిగిరావాలి.



# చిత్తూరుజిల్లా



చరిత్ర : పరమ పవిత్రమైన సువర్ణముఖి నది ఈ జిల్లా లోనిదే. రాయలసీమ జిల్లాలో ఒకటైన ఈ చిత్తూరు జిల్లా 1వ శతాబ్దం నుంచి జనావాసంగా వుండేది. పల్లవులు, చోళులు, యాదవులు, గోల్కొండ నవాబులు, కర్ణాటక నవాబులు పాలించిన ప్రదేశం.

1911లో ఏర్పడ్డ ఈ చిత్తూరుజిల్లా 12°37' - 14°08' అక్షాంశ రేఖలపై 78°03' - 79°55' తూర్పు రేఖాంశం మధ్య వుంది.

ప్రపంచ వ్యాపితంగా పేరెన్నిక గల తిరుమల తిరుపతి ఈ జిల్లాలోనిదే.

సరిహద్దులు : తూర్పున నెల్లూరు జిల్లా, తమిళనాడు, పశ్చిమాన కర్ణాటక రాష్ట్రం ఉత్తరాన కడప, అనంతపురం జిల్లాలు; దక్షిణాన తమిళనాడు.

దీని వైశాల్యం : 15,152 చ.కి.మీ. ఇందు జనాభా 32,61,000 అటవీ ప్రాంతం 30%.

లోక్‌సభ నియోజక వర్గములు 2, శాసనసభ నియోజక వర్గములు 15.

నదులు : పింఛ, కౌండిన్య, పాలర్, అరణి, పాపఘ్ని.

ముఖ్యపంటలు : రాగులు, వరి, జొన్న,ఉలవలు, వేరుశెనగ, చెరకు, మామిడి.



పరిశ్రమలు : చాక్లెట్లు, సిరామిక్స్‌లతోపాటు లెదర్.

ఈ జిల్లా ముఖ్యకేంద్రం చిత్తూరు నుంచి అనేక ప్రాంతాలకు దూరం (కి.మీ.లలో) తిరుపతి 70, పలమనేరు 40, శ్రీకాళహస్తి 109, నగరి 109, పుత్తూరు 95.

తిరుపతి నుంచి అనేక నగరాలకు దూరం - హైదరాబాద్ 704 కి.మీ., అదే హైదరాబాద్ నుంచి కర్నూలు కడప మీదుగా 617 కి.మీ. బెంగుళూర్ నుంచి 170 కి.మీ., ముంబాయి నుంచి 1281, కలకత్తా నుంచి 2887 కి.మీ.

1600 కోట్ల సంవత్సరాల క్రితం సహజశిలా ప్రతిమగా ఏర్పడ్డ శ్రీ వేంకటేశ్వరుని ఆలయం గల ఈ చిత్తూరు జిల్లాలో దర్శనీయ స్థలాలు -

## తిరుమల-తిరుపతి

తిరుమల శిఖరాగ్రంపై నెలకొనియున్న శ్రీవేంకటేశ్వరుని ఆలయం దేశంలో అత్యంత ప్రాచీనమైనది. శ్రీ రామానుజుల వారి పాదస్పర్శతో పవిత్రమైన ఈ ప్రదేశం నిత్యం పచ్చతోరణమే. నిత్య పెళ్ళికొడుకు శ్రీ వేంకటేశ్వరుని చూడటానికి బ్రహ్మ ఇచ్చిన ఈ రెండు కనులు చాలవు. ఆ దివ్య మంగళ స్వరూపాన్ని చూడటానికి, చూచి తరించటానికి భారతదేశం నుంచి కాక మొత్తం ప్రపంచం నుంచి, ఎంతోమంది భక్తులు శ్రీవారిని (స్వామివారిని) దర్శించి తరిస్తున్నారు. తిరుపతిలో గోవిందరాజుస్వామి ఆలయం, శ్రీనివాస మంగాపురం నారాయణవనం వున్నాయి

**చంద్రగిరి :** 1640లో నిర్మించిన కోట వుంది మహామంత్రి తిమ్మరుసు జన్మస్థలం. ఇక్కడి రాజమహల్ తప్పక దర్శింపదగ్గది.

**తిరుచానూర్ :** తిరుపతికి 5 కి.మీ. దూరంలో స్వర్ణముఖి తీరానగల ఇక్కడే శుకమహర్షి తపస్సు చేసింది. ఇక్కడి పద్మావతీ దేవాలయాన్ని తిరుమలని దర్శించిన వారు తప్పక దర్శిస్తారు.



## శ్రీ కాళహస్తి



**నారాయణవనం :** పద్మావతి తండ్రి ఆకాశరాజు పాలించిన ...... శ్రీ కళ్యాణ వేంకటేశ్వరుని ఆలయం వుంది.

**హర్స్లీహిల్స్ :** పర్వత ప్రాంతం. విశ్రాంతి, విహార కేంద్రం. ఈ హిల్స్ 1266 మీటర్ల ఎత్తున వున్నాయి.

## కాణిపాకం

చిత్తూరుకి పడమటలో ఐరాల వెళ్ళే దారిలో వర సిద్ధివినాయక స్వామి గుడి ఉంది. ఇక్కడ గణపతిస్వామి నీళ్ళలో కూర్చుని ఉంటాడు. చాలా శక్తివంతమైన దేవుడు చుట్టు పక్కల ఊళ్ళవాళ్ళు ఏ గొడవలైనా స్వామి దగ్గరికొచ్చి అక్కడ తమ వివాదాలను పరిష్కరించుకుంటారు.

## కైలాసనాథకోన జలపాతం

చెన్నై వెళ్ళేదారిలో నాగలాపురం అవతల బస్సు దిగి రెండు కి.మీ. దూరం వెళితే ఈ సుందర జలపాతాన్ని కనులారా చూడవచ్చు. నవంబర్, డిసెంబర్, జనవరిలో సందర్శిస్తే మరింత బాగుంటుంది. ఈ జలపాతం నీటిలో ఎన్నో వ్యాధులను నిర్మూలించే శక్తి వుందని ప్రతీతి.

## పులికాట్ సరస్సు

మంచి పిక్నిక్ స్పాట్ శ్రీకాళహస్తికి 27 కి.మీ. దూరంలో ఉంది. ప్రక్కనే వున్న శ్రీహరికోటకు కూడా అనుమతి తీసుకొని చూడవచ్చు. శ్రీకాళహస్తి లింగం ఎత్తైన పీఠం మీద ఉంటుంది. లింగం దంతాలతో కూడిన ఏనుగవలె ఉంటుంది. లింగం కుడిభాగంలో సాలీడు కనిపిస్తుంది. స్వామి పశ్చిమాభిముఖంగా తిరుపతి కొండలవైపే చూస్తూ ఉంటారు.

ఆలయ ప్రాంగణంలోనే వున్న సూర్య పుష్కరిణి, చంద్రపుష్కరిణి కాక ఈ కాళహస్తి కొండల్లో పన్నెండు తీర్థాలున్నాయి. అవి సుప్రసిద్ధములైనవి. ఈ క్షేత్రం తిరుపతి నుంచి 38 కి.మీ. దక్షిణ కాశిగా ఈ క్షేత్రానికి పేరు వుంది.





# రంగారెడ్డి జిల్లా



**చరిత్ర :** క్వార్జ్, పింగాణిమన్ను, ఇళ్ళకు పరిచే రాళ్ళు విరివిగా దొరికే ఈ జిల్లా ముఖ్యకేంద్రం హైదరాబాద్. తెలంగాణా ప్రముఖ నాయకుడు శ్రీ కె.వి. రంగారెడ్డి పేరున ఏర్పడ్డ ఈ జిల్లా 16°-50 - 18°10 ఉత్తర అక్షాంశం, 77°80' - 79°30' తూర్పు రేఖాంశం మధ్యగలదు.

**మూసీనది జన్మస్థానమైయిన ఈ జిల్లా పరిహద్దులు :** ఉత్తరపు వైపున మెదక్, దక్షిణాన మెహబూబ్‌నగర్, తూర్పున నల్గొండ జిల్లా, పడమటన కర్నాటక రాష్ట్రం. 1978వ సంవత్సరంలో హైదరాబాద్‌లోని గ్రామీణ ప్రాంతాలను కలిపి ఈ జిల్లాగా మార్చారు.

**ఈ జిల్లా వైశాల్యం :** 7493 చ.కి.మీ. **అటవీ ప్రాంతం :** 9%

**ఇందు జనాభా :** 25,51,000

**ముఖ్య పంటలు :** వరి, జొన్నలు, వేరుశెనగ, మొక్కజొన్న.

**పరిశ్రమలు :** అనేక చిన్న పరిశ్రమలతోపాటు, భారీ పరిశ్రమలు (గాజు, పింగాణీ, సిమెంట్, రసాయనిక ద్రవ్యములు, మోటర్ సైకిళ్ళు)

ఇందు విహార ప్రదేశాలు

**అనంతగిరి** : ఇక్కడున్న అనంతస్వామి దేవాలయం ప్రసిద్ధి పొందిన క్షేత్రం. అయితే ఈ దేవాలయంలో స్వామి విగ్రహం లేదు.

**శివరగుట్ట** : శ్రీ భవాని రామలింగేశ్వర స్వామి దేవస్థానం వుంది. ప్రాచీనమైన దేవాలయం.

**అల్వాల్** : శ్రీ బాలాజీ వేంకటేశ్వరాలయం వుంది. ఈ ఆలయం రెండు వందల సంవత్సరాల నాటిది.



# హైదరాబాద్ జిల్లా



చరిత్ర : ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనిది. బాదామి, చాళుక్య, శాతవాహనులు కాకతీయులచే పాలించబడిన ప్రాంతం. 1321 నుంచి మహమ్మదీయ పాలన ప్రారంభమయింది. సుల్తాన్ కులీ కుతూబ్ షా 1590లో ఈ నగరాన్ని నిర్మించాడు. స్వాతంత్ర్యం వచ్చాక కూడా నిజాం తన రాజ్యాన్ని భారతదేశంలో విలీనం చేయకపోవడంతో 1948లో సైనిక చర్య జరిపి దేశంలో కలిపారు. 1956 నవంబర్ 1న ఈ హైదరాబాద్ జిల్లా రాష్ట్ర రాజధానిగా మారింది.

ఇక్కడి ముఖ్యనది : మూసీ

పంటలు : ద్రాక్ష, వరి

పరిశ్రమలు : తోళ్ళ పరిశ్రమలలాంటి వాటితోపాటు అనేక పరిశ్రమలకి ఈ హైదరాబాద్ ప్రధాన కేంద్రం.

ఉత్తర, దక్షిణ భారతీయుల కలయిక గల ఈ హైదరాబాద్‌లో చూడాల్సిన ప్రదేశాలు.

గోల్కొండ : శిథిలమైపోయిన ఈ కోట ఇప్పటికీ యాత్రికులను ఆకర్షిస్తోంది.

ఓ పక్కగా కుతుబ్‌షాహీల సమాధులున్నాయి. ఇక్కడే భద్రాచల రామదాసును బంధించిన కారాగారము ఉంది. 120 మీటర్ల ఎత్తునగల కొండమీద ఉన్న ఈ కోట ప్రత్యేక ఆకర్షణ, శబ్దవిద్యలోని ప్రావీణ్యం, విశిష్టత ఇక్కడ వినవచ్చు. మొదటి ద్వారం దగ్గర నిలబడి శబ్దం చేస్తే చాలు 61 మీటర్ల ఎత్తున ఉన్న దర్బారు హాలులోకి వినపడుతుంది. దీని రహస్యం ఇప్పటికీ మేధావులకు అంతుపట్టలేదు. ప్రసిద్ధి చెందిన కోహినూర్ వజ్రం ఇక్కడిదే.

చార్మినార్ : 186 అడుగుల ఎత్తు, 55 మీటర్ల ఎత్తుగల నాలుగు స్థంభాల ప్రఖ్యాత కట్టడం ఇది.



శ్రీ వెంకటేశ్వర స్వామి దేవాలయము,
దేవునికుంట, హైదరాబాద్ - 28



[illegible]

**జుమామసీదు :** 1598లో కట్టబడిన పురాతన కట్టడం ఫలక్‌నామా పాలెస్. ఇందులో నిజాం నవాబులు సేకరించిన అనేక అద్భుత అరుదైన వస్తువులున్నాయి.

**ఉస్మాన్ సాగర్ :** ఇక్కడి నుంచే హైదరాబాద్ పట్టణానికి మంచినీరు వచ్చేది.

**సాలార్‌జంగ్ మ్యూజియం :** 35 వేల రకాలైన అరుదైన వస్తువులు ప్రపంచం నలుమూలల నుండి సేకరించబడ్డాయి. రాజులు వాడిన సర్వవస్తువులు. అరుదైన దంతపు సామానులు వగైరాలు అనేకం. ప్రసిద్ధి పొందిన యూరోపియన్ పెయింటింగ్‌లే కాక లూయిస్ వాడిన వస్తువులు. అంటోనియెట్స్ వాడిన టేబుల్ కూడా ఉంది. విచిత్రమైన గడియారం, విషం పెడితే రంగుమారే పళ్లెం మొదలైన ఎన్నో వింతలు ఈ మ్యూజియంలో ఉన్నాయి.

ఇంకా పబ్లిక్ గార్డెన్స్, సుందరమయిన పాలరాతి హిందూ దేవాలయం బిర్లామందిర్, నెహ్రూ జూలాజికల్ పార్క్ చూడదగ్గవి.

ఓషన్ పార్క్ : సిటీకి దూరంగా వున్న ఇక్కడ రకరకాల వాటర్ గేమ్‌లున్నాయి. స్విమ్మింగ్ చేయవచ్చు. వీడియోగేమ్స్ కూడా వున్నాయి. ఇక్కడ ఓ రోజంతా ఎంజాయ్ చేయవచ్చు.

**లుంబిని పార్క్** : ప్రవేశం రూ. 2. లోపల బోటు మీద హుస్సేన్‌సాగర్‌లో తిరగొచ్చు. బుద్ధుడి చుట్టూ రౌండ్ వేయచ్చు బోటులో ఆహ్లాదకరమైన సాయంత్రాన్ని గడపొచ్చు ఈ పార్క్‌లో.

సికింద్రాబాద్‌లో శ్రీ ఉజ్జయిని మహాకాళి దేవస్థానము, శ్రీ వేంకటేశ్వర స్వామి దేవస్థానము చిక్కడపల్లిలో, శ్రీ సీతారామచంద్రమూర్తి దేవాలయము సీతారాంబాగ్‌లో, శ్రీ గణపతి దేవాలయం సికింద్రాబాద్‌లో, విజయనగర్ కాలనీలో శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానములే కాక ప్రఖ్యాతి చెందిన (హైదరాబాద్) బిర్లామందిర్ ఉన్నాయి.



# నిజామాబాద్ జిల్లా


ఆదిలాబాద్ జిల్లా
బోధన్
నిజామాబాద్
మదూరు
కరీంనగర్ జిల్లా
కామారెడ్డి
మహారాష్ట్ర
ఎల్లారెడ్డి
మెదక్ జిల్లా
మెదక్ జిల్లా

# నిజామాబాద్ జిల్లా



చరిత్ర : ఈ జిల్లా ముఖ్యపట్టణం నిజమాబాద్. ఈ జిల్లా 18°15' - 19°00' ఉత్తర అక్షాంశము, 77°40' - 78°37' తూర్పు రేఖాంశాల మధ్య వుంది. నిత్యవర్షే మిత్రుని పేరున ఏర్పడ్డ ఇంద్రపురే నేటి నిజామాబాద్.

ఈ జిల్లా వైశాల్యం : 7,956 చ.కి.మీ.

అటవీ ప్రాంతము : 22%

ఇందు జనాభా : 20,37,000

లోకసభ నియోజక వర్గములు 1, శాసనసభ నియోజకవర్గములు 9.

పరిహద్దులు : ఉత్తరాన అదిలాబాద్ జిల్లా, తూర్పున కరీంనగర్ జిల్లా, దక్షిణాన మెదక్ జిల్లా పశ్చిమాన మహారాష్ట్ర, కర్నాటక.

నదులు : గోదావరి, పూలంగు, ఎడ్లకట్ట, మంజీరా

పంటలు : మొక్కజొన్న, బియ్యం, వేరుశెనగ, చెఱకు.

పరిశ్రమలు : పేపర్-పంచదార.

పంచదార పరిశ్రమలో పెద్ద స్థానమైన ఈ జిల్లా ప్రధాన కేంద్రం నిజామాబాద్‌లోని అనేక ప్రాంతాలకి దూరం కి.మీ.లలో - కామారెడ్డి 59, ఆర్మూరు 28, బోధన్ 30, భీమిగల్ 59. ఈ జిల్లాలో దర్శనీయ ప్రదేశాలు -

**కోలాసపురం :** కాకతీయులు నిర్మించిన కోట వుంది. ఈ కోట బోధన్‌కు 25 కి.మీ. దూరంలో వుంది.

అచ్చంపేట (నిజాంసాగర్ డ్యాం), మంది పల్లి (పెద్ద రిజర్వాయరు), సారంగపురంలో ఛత్రపతి శివాజీ గురువుచే నిర్మించబడిన దేవాలయం వుంది.

**భీంగల్ :** లక్ష్మినరసింహస్వామి ఆలయం వుంది.

**డిచ్‌పల్లి :** చక్కటి శిల్పకళగల రామస్వామి దేవాలయం వుంది.

**నిజామాబాద్ :** శ్రీ నీలకంఠేశ్వర స్వామి, రఘునాథ దేవాలయంతో పాటు శ్రీ లక్ష్మీ నరసింహస్వామి దేవాలయం వుంది. ప్రసిద్ధి పొందిన అష్టముఖి కోనేరు వుంది.



శ్రీ సిద్ధి రామేశ్వరస్వామి
భిక్కనూరు, నిజామాబాద్ జిల్లా.

# మెదక్ జిల్లా



చరిత్ర : మెతుకుసీమ దుర్గమని ఒకప్పుడు పిలచేవారు. అలా మెదక్ అయి, ఆ పేరులోనే మెదక్ జిల్లా అయింది. వ్యవసాయమే ప్రధాన ఆధారమైన ఈ జిల్లా 17°28' - 18°19' ఉత్తర అక్షాంశం మీద 78°28' - 79°10' తూర్పు రేఖాంశముల మధ్య వుంది. కాకతీయుల, గోలుకొండ నవాబులు, మొగలాయిలు, కళ్యాణి చాళుక్యుల లాంటి అనేక మంది పరిపాలించారు.

ఈ జిల్లా వైశాల్యం : 4699 చ.కి.మీ.

అటవీ ప్రాంతం : 10%

ఇందు జనాభా : 22,69,000

లోక్‌సభ నియోజక వర్గములు 2, శాసనసభ నియోజక వర్గములు 10.

సరిహద్దులు : ఉత్తరాన కరీంనగర్, నిజామాబాద్ జిల్లాలు, దక్షిణాన హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాలు; తూర్పున వరంగల్, నల్గొండ జిల్లాలు; పశ్చిమాన కర్నాటక రాష్ట్రం.

నదులు : హల్దా, కొల్లేరు, మంజీరం.

పరిశ్రమలు : ఎలక్ట్రానిక్, మందుల రసాయనాలు, కెమికల్స్.

పంటలు : మొక్కజొన్న, వరి, వేరుశెనగ, అల్లం.

ఈ జిల్లా ప్రధాన కేంద్రము మెదక్ నుంచి అనేక ప్రాంతాల [illegible] (కి.మీ.లలో) : నారాయణఖేడ్ 100, సిద్ధిపేట 75, సదాశివపేట 64, సంగారెడ్డి 70

**ఈ జిల్లాలో దర్శనీయ ప్రదేశాలు -**

**మెదక్** : క్రీ.శ. 1620లో తయారైన ఇత్తడి మెదక్ కోటలో వుంది. దక్షిణ భారతంలోనే పెద్దదయిన చర్చి కూడా ఈ మెదక్‌లోనే వుంది.

**నదుపాయాలు** : మంజీరా నదులన్నీ కలిపే ప్రదేశం. మహాశివరాత్రికి బ్రహ్మాండమైన ఉత్సవాలు జరుగుతాయి.

**రామాయంపేట** : కంచు వస్తువులతోపాటు ఇత్తడి వస్తువులకి ప్రసిద్ధి.

**జోగిపేట** : జోగులు ఎక్కువగా వుండే ఇక్కడ అనేక దేవాలయాలున్నాయి. మెదక్ నుంచి 35 కి.మీ.

**అల్లాదుర్గ్** : శ్రీ వీరభద్ర ఆలయం వుంది.

**కొండాపూర్** : అనేక శాసనాలుగల చారిత్రాత్మకమైన ప్రదేశం.

**జాహిరాబాద్** : ఇక్కడ జరిగే ఉరుసు ఉత్సవాల గురించి అనేక ప్రాంతాల నుంచి హిందువులు కూడా వస్తారు.



# మహబూబ్‌నగర్ జిల్లా



**చరిత్ర :** స్టియటెట్ అనే లోహం బాగా దొరికే ఈ మైసూర్ సరిహద్దుగల జిల్లా మీర్‌మెహబూబ్ అలీఖాన్ పేరున ఏర్పడింది. మొగలాయిలు, బహమని సుల్తానులు, కాకతీయులు, నైజాం నవాబులు పాలించిన ఈ ప్రదేశాలన్నీ జమిందార్లు కూడా చాలా కాలంగా పాలించారు.

1883 సంవత్సరంలో ఏర్పడ్డ ఈ జిల్లా 16°-17' ఉత్తర అక్షాంశములపైన, 77°79' తూర్పు రేఖాంశాలపై వున్నది.

**దీని సరిహద్దులు :** ఉత్తరపు వైపున హైదరాబాద్, నల్గొండ జిల్లాలు; పశ్చిమాన కర్నాటక రాష్ట్రం, దక్షిణాన కృష్ణా, తుంగభద్రా నదులు, తూర్పున ప్రకాశం, గుంటూరు జిల్లాలు.

**ఈ జిల్లా వైశాల్యం :** 18,432 చ.కి.మీ., అటవీ ప్రాంతం 16%.

**ఇందు జనాభా :** 30,37,000.

**లోక్‌సభ నియోజక వర్గములు 2, శాసనసభ నియోజకవర్గములు 13.**

**నదులు :** కృష్ణా, తుంగభద్ర, అయినదిండి, పెద్దవాగు, చిన్నవాగు.

**పంటలు :** రాగి, జొన్న, వేరుశెనగ, చెఱకు.

**పరిశ్రమలు :** చేనేత, స్పిన్నింగ్ మిల్స్.

మామిడిపండ్లు, అపరాలు పండే ఈ కృష్ణానదీ పరివాహక ప్రదేశం ముఖ్య కేంద్రమయిన మెహబూబ్‌నగర్ నుంచి అనేక ప్రాంతాలకి దూరం కి.మీ.లలో - ఆత్మకూర్ 84, నారాయణ్‌పేట 72, షాద్‌నగర్ 51, కొల్లాపూర్ 159, వనపర్తి 78, అచ్చంపేట 100, కల్వకుర్తి 62, జడ్చర్ల 19, శ్రీశైలం 200, కర్నూలు 120, తిరుపతి 390, విజయవాడ 332, విశాఖపట్టణం 749.

అమృతంలాంటి మధుర ఫలాలు సీతాఫలాలు విస్తృతంగా దొరికే ఈ జిల్లాలో దర్శనీయ క్షేత్రాలు -

**అలంపూర్** : కర్నూల్ నుంచి 15 కి.మీ.దూరం. ఈ అలంపురానికి దక్షిణకాశిగా పేరు. నవబ్రహ్మలకు ఆలయాలున్నాయి. ఇక్కడున్న బాలబ్రహ్మేశ్వర లింగమునకు ఎన్ని బిందెలు నీటిలో అభిషేకం చేసినా ఒక్క చుక్క కూడా బయటికి రాదు. వనమూలికలతో చేసిన రససిద్ధ వినాయకుడున్నారు.

**వనపర్తి** : లిట్టలేశ్వర దేవాలయం వుందిక్కడ. ఇక్కడే విట్టలేశ్వర ఆలయం వుంది.

**బీచుపల్లి** : శ్రీ ఆంజనేయస్వామి ఆలయం. సర్వ వ్యాధులను నివారణ చేసే మహిమగల్ల స్వామి. ఇక్కడున్న కలిమి చెట్టు మహిమగలది.

ఘనపురం దుర్గం కొండపై వుంది.ఇక్కడ నీళ్ళు తాగుతున్న నంది విగ్రహం చూపరులని ఆకర్షిస్తుంది.

**పానగల్లు** : వనపర్తి 10 కి.మీ. దూరంలో వుంది. ఏడు బురుజుల ఏడు ప్రాకారాల దుర్భేద్య మైన కోట వుంది.

**మన్నెం కొండ** : చాలా ఎత్తుగల కొండ. మూడో కొండ శిఖరం వద్ద వేంకటేశ్వర ఆలయం వుంది.



# నల్గొండ జిల్లా



చరిత్ర : ఆముదాలు ప్రత్యేక పంటగల ఈ జిల్లా సరిహద్దులో కృష్ణానది ప్రవహిస్తోంది. అరణ్య ఉత్పాదిత వస్తువులు అనేకం దొరుకుతాయి. నల్గొండ పేరుతో ఏర్పడ్డ ఈ జిల్లా 16°25' - 17°50' ఉత్తర అక్షాంశము 78°40' - 80°05' తూర్పు రేఖాంశములపై వున్నది.

నీలగిరిగా పిలవబడిన ఈ నల్గొండ జిల్లాను పూర్వకాలంలో కాకతీయులు, శాతవాహనులు, కుతుబ్‌షాహి మొగలాయిలు పాలించారు. 1950లో ఈ జిల్లా ఏర్పడింది.

దీని సరిహద్దులు : ఉత్తరంవైపు మెదక్ వరంగల్ జిల్లాలు, తూర్పున కృష్ణా, ఖమ్మం జిల్లాలు. పశ్చిమాన రంగారెడ్డి, హైదరాబాద్, దక్షిణాన మహబూబ్‌నగర్ జిల్లా.

ఈ జిల్లా వైశాల్యం : 14,240 చ.కి.మీ.

అడవులు విస్తీర్ణం : 6%

ఇందు జనాభా 28,52,000.

లోక్‌సభ నియోజకవర్గములు 2, శాసనసభ నియోజకవర్గములు 10.

నదులు : కృష్ణా, పాడి, ఆలేరు, మూసీ, అహల్య.

పంటలు : వరి, వేరుశెనగ, జొన్నలు, ఆముదాలు.

పరిశ్రమలు : పంచదార, కలప, సిమెంట్.

కలప, తంగేడు, చర్మములు, మెట్ట బాగా ఉత్పత్తి అయ్యే ఈ జిల్లా ప్రధాన కేంద్రం నల్గొండ నుంచి అనేక ప్రాంతాలకి దూరం కి.మీ.ల్లో - మెదక్ 205, శ్రీశైలం 220, కడప 381, తిరుపతి 600, విజయవాడ 202, విశాఖపట్నం 547, మిర్యాలగూడ 46, దేవరకొండ 64, భువనగిరి 73, యాదగిరి గుట్ట 82, సూర్యాపేట 50, కోదాడ 101.

మూసీనది ప్రవహించే ఈ నల్గొండ జిల్లాలో దర్శనీయ ప్రదేశాలు.

## నాగార్జున సాగర్

ఆచార్య నాగార్జునుని నివాసం. 1926లో ఈ ప్రదేశాన్ని త్రవ్వగా పురాతత్వ శాఖ వారికి అపారమైన అవశేషాలు లభించాయి. కొండమీద అపురూపంగా భద్రపరిచిన ప్రాచీన శిలా శిల్పాలు, మహారాణి స్నానఘట్టం, మ్యూజియం, లాల్‌బహదూర్, జవహర్‌లాల్ నెహ్రూ పేర్లమీద వున్న ఎడమకాలువ, కుడికాలువలే కాక 11 కి.మీ. దూరంలో వున్న ఎత్తిపోతల జలపాతం కూడ చూడదగ్గది. ఇక్కడ చంద్రవంక నది నీరు పైనుంచి పడుతుంది.

ఇక్కడ శ్రీరంగనాయస్వామి ఆలయం చాలా రమణీయం. జూన్ నుంచి ఫిబ్రవరి లోపు సాగర్ నుండి శ్రీశైలంకి బోటులో ప్రయాణించవచ్చు.

**వాడపల్లి :** దీన్నే వజీరాబాద్ అని కూడా అంటారు. కాకతీయులు నిర్మించిన దుర్గముంది. ఈ వాడవల్లి వద్ద ముచికుంద నది కృష్ణానదిలో సంగమిస్తుంది.

**దేవరకొండ :** బ్రహ్మాండమైన దుర్గముంది. 360 బురుజులు 9 మహాద్వారాలున్నాయి. కోటలో రామలయ, గోపాలస్వామి ఆలయాలున్నాయి. 1,25,000 పుట్ల వడ్లు పట్టే ధాన్యపు కొట్టు వుందిక్కడ.

**నల్లగొండ :** ఇక్కడున్న కొండపై దేవాలయం వుంది. దాని ధ్వజ స్థంభము కొండ కింద వుంటుంది. శిధిలమైన కోటలు, గుళ్ళున్నాయి.

**పిల్లలమర్రి :** సూర్యాపేట తాలుకా అమనిగంటికి 10 కి.మీ. దూరం. ఇక్కడున్న మర్రిచెట్టు క్రింద రేచర్ల బేతిరెడ్డి అనే అతను అతని సోదరుడు నిద్రించారట. అర్ధరాత్రి చెట్టుపై భేతాల శక్తిని గమనించి దానిని ఛేదించి చెట్టు



యాదగిరి గుట్ట

క్రింద నిధి నిక్షేపాలు గ్రహించి వాటితో చక్కని నగరాన్ని నిర్మించాడుట. అదే రాజధానిగా మారింది. ఇక్కడ మూడుశివాలయాలున్నాయి.

**ఘాజుల ఖండ :** బౌద్ధ క్షేత్రం. ఇక్కడున్న మట్టిదిబ్బలు త్రవ్వగా అనేక ప్రాచీన విశేషాలు దొరికాయి. 30 అడుగుల ధర్మచక్రం వుండి.

**భువనగిరి :** ఈ నగరంలో కొండ మీద బ్రహ్మాండమైన దుర్గముంది. కొండమీద సప్త సరస్సులున్నాయి. రాజభవనం ప్రక్కనున్న అగాధమయిన బావిలోతు ఇంతవరకు ఎవరూ కనుక్కోలేదు.

**కొలనుపాక :** భువనగిరి నుంచి 30 కి.మీ. ఇక్కడున్న 'కాశీబుగ్గ' అనే బావిలో గల జలం గంగోదకంతో సమానమని ప్రసిద్ధి. శిథిలావస్థలో సాలంకములు,

నందులు, సప్తమాతల విగ్రహాలున్నాయి. ఈ పట్టణం అంత్యకాలంలో సర్వాయి పాపారాయుడు అనే వాడు దోచుకున్నాడు.

**యాదగిరిగుట్ట :** పంచనరశింహా క్షేత్రం. సర్పాకార విగ్రహం నరశింహస్వామి. ధ్యానముద్రలో వున్నది. యోగనంద నరసింహస్వామి రూపం. ఇక్కడే వెండి నరశింహుల రూపాలున్నాయి. గుహకు దగ్గరిలో ఆంజనేయస్వామి విగ్రహం వుంది. చక్కటి అధ్యాత్మిక ప్రదేశం. మంచి రమణీయత ప్రాంతం ఈ యాదగిరి గుట్ట.

**నందికొండ :** ఇక్ష్వాకుల నాటి అనేక వస్తువులున్నాయి. మ్యూజియం వున్న ఈ నందికొండ నుంచి సాగర్ 9 కి.మీ.

# వరంగల్ జిల్లా



**చరిత్ర :** కాకతీయుల సామ్రాజ్య వైభవం ఇప్పటికీ గోచరించే ఈ జిల్లా. ఒకప్పుడు ఈ జిల్లా ముఖ్యకేంద్రమయిన వరంగల్‌ను ఓరుగల్లు అనేవారు. ఏక శిలా నగరమని కూడా అంటారు. మహమ్మదీయ, మొగలాయిలు, నిజాంనవాబులు పాలించిన ఈజిల్లా 17°19 - 18°36' ఉత్తర అక్షాంశంపై 78°49' - 80°43' తూర్పు రేఖాంశంపై వున్నది. ఈ జిల్లా 1905లో ఏర్పడింది.

**ఈ జిల్లా వైశాల్యం :** 12846 చ.కి.మీ.

**అటవీ ప్రాంతం :** 28%



శ్రీ భద్రకాళీదేవి, వరంగల్

ఇందు జనాభా 28,18,000.

లోక్‌సభ నియోజక వర్గములు 2, శాసన సభ నియోజన వర్గములు 13.

ఒకప్పుడు ఖమ్మం జిల్లాలో భాగంగా వున్న ఈ వరంగల్ జిల్లా పరిహద్దులు : ఉత్తరాన కరీంనగర్, పశ్చిమాన మెదక్, తూర్పున ఖమ్మం జిల్లా, దక్షిణాన నల్గొండ, ఖమ్మం జిల్లాలు.

నదులు : ఆలేరు, గోదావరి, పాలేరు, వైరా

పంటలు : మిర్చి, వేరుశెనగ, పెసలు, జొన్నలు, వరి,

పరిశ్రమలు : తోళ్ళు, జౌళి .

కాకిరాయి విస్తృతంగా దొరికే ఈ జిల్లా ప్రధాన కేంద్రం వరంగల్ నుంచి అనేక ప్రాంతాలకి దూరం (కి.మీ.లలో) - ఖమ్మం 127, నల్గొండ 180, శ్రీశైలం 404, తిరుపతి 723, విజయవాడ 397, విశాఖపట్నం 564 కి.మీ., మంగపేట 124, చేజర్ల 103, ఏలూరు నగరం 93, జనగాం 56, మహబూబాబాద్ 64.

పాకాల, ఏటూరి నాగారం వద్ద వన్య సంరక్షణ కేంద్రాలు ఈ వరంగల్ జిల్లాలోని దర్శనీయ స్థలాలు.

**సమ్మక్క-సారక్క జాతర** : మేడారంలో రెండేళ్ళకొక్కసారి జరిగే ఈ జాతరను చూడటానికి నలువైపుల నుంచి వస్తారు. కాకతీయుని ఎదిరించిన వీరి పేరుమీద జరిగే ఈ జాతర వరంగల్ నుంచి 109 కి.మీ. దూరంలో మేడారంలో జరుగుతుంది.

**ఘనపురం** : కాకతీయుల కాలంనాటి కోటలో, శిల్పాలు చూడొచ్చు.

**పాలంపేట** : చక్కటి శిల్పసంపద అణువణువు పులకింప చేస్తుంది. కాకతి గణపతి దేవుడు 1113లో నిర్మించిన రామప్ప చెరువు వుంది. రాతీయక్షిణి విగ్రహాలు అంగవిన్యాసము యౌవనశోభ అద్భుతం. అలాంటివి ఎన్నో ఇక్కడ.

**మొగలిచర్ల** : వరంగల్ నుంచి 6 కి.మీ. దూరం. ఇక్కడ ఏకవీరా దేవి ఆలయం వుంది. కాకతీయ వంశోద్ధారకులైన రుద్రమదేవి ఇక్కడ నిత్యం పూజలు చేసేది.

**కొరివి గ్రామము** : ఇక్కడున్న వీరభద్రుని రూపం భయంకరమైనది. ఈ గ్రామం మహబూబాబాద్ నుండి 10 కి.మీ. దూరం. ఇక్కడే కాకతీయుల నాటి శిధిల దేవాలయం కూడా వుంది.

**వరంగల్** : బ్రహ్మాండమైన కోట వుంది. అనేక స్మారక చిహ్నాలు, అవశేషాలున్నాయి. 13వ శతాబ్దంలో కాకతి గణపతి దేముడు తన రాజధానిగా ఈ వరంగల్‌ని పాలించాడు. హనుమకొండలో వేయి స్థంభాల గుడి, రంగనాథ స్వామి ఆలయంతో పాటు పలు ఆలయాలున్నాయి. ఇక్కడ తయారయ్యే నూలు, తివాచీలు ప్రసిద్ధి చెందినవి. అత్యంత గిరాకీ కలవి. పురావస్తు మ్యూజియం వుంది.

# ఖమ్మం జిల్లా


మధ్యప్రదేశ్
వెంకటాపురం
వరంగల్ జిల్లా
భద్రాచలం
కొత్తగూడెం
తూర్పు
గోదావరి
జిల్లా
ఖమ్మం
పశ్చిమగోదావరి జిల్లా
మధిర
కృష్ణాజిల్లా

# ఖమ్మం జిల్లా



చరిత్ర : బొగ్గు ఉత్పత్తి కేంద్రమయిన కొత్తగూడెం ఈ జిల్లాలోనిదే. క్రీ.శ. 1006 ఖమ్మం కోటను నిర్మించి రెడ్డిరాజులు పాలించారు. ఆపై విజయనగర రాజులు, గోల్కొండ నవాబులు ఈ ప్రాంతాన్ని పాలించారు. ప్రఖ్యాతి చెందిన భద్రాచల క్షేత్రం ఈ జిల్లాలోనిదే.

1953లో ఏర్పడ్డ ఈ ఖమ్మంజిల్లా 16°45' - 18°35' ఉత్తర అక్షాంశం 79°47 - 80°47' తూర్పు రేఖాంశాల మధ్య వుంది.

నేలబొగ్గు, అభ్రకం, కెంపురాయి అపారంగా దొరికే ఈ జిల్లా సరిహద్దులు : ఉత్తరాన మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు; తూర్పున తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి జిల్లాలు: పశ్చిమాన నల్గొండ, వరంగల్ జిల్లాలు: దక్షిణాన కృష్ణాజిల్లా.

**ఈ జిల్లా వైశాల్యం** : 16.029, చ.కి.మీ.

**అడవులు** : 47%

**ఇందు జనాభా** : 22,15,000

**లోక్‌సభ నియోజక వర్గములు** 2, **శాసనసభ నియోజక వర్గములు** 9.

**పంటలు** : వరి, కాయధాన్యములు, పొగాకు, కందులు, పెసలు.

**నదులు** : కిన్నెరసాని, శబరి, గోదావరి, మున్నేరు, పాలేరు, ఆలేరు, కైలా.

**పరిశ్రమలు** : పేపర్, పంచదార, బొగ్గు.



భద్రాచలం

ఈ జిల్లాలోని సింగరేణిలో 1872లో నేలబొగ్గు కలదని డా॥ కింగ్ కనిపెట్టారు. పుణ్యప్రదేశాలకి, మానవ అవసరాలకి అపారంగా బొగ్గు దొరికే ఈ జిల్లా ప్రధాన కేంద్రం ఖమ్మం నుంచి అనేక ప్రాంతాలకి దూరం (కి.మీ.లలో) -

భద్రాచలం 130, శ్రీశైలం 330, తిరుపతి 548, విజయవాడ 144, విశాఖపట్టణం 437, పాల్వంచ 35, వెంకటాపురం 234, ఇల్లెందు 55, సత్తుపల్లి 102, రెడ్డిరాజులు 300 సంవత్సరాలు పాలించిన ఈ ఖమ్మం జిల్లాలో పర్యాటక ప్రదేశాలు -

## భద్రాచలం

క్షేత్ర మహత్యము చాలా ప్రాముఖ్యం. కంచర్ల గోపన్న 1670 నుంచి 1674 వరకూ శ్రీ రామాలయము నిర్మాణం చేశారు. ఈ నిర్మాణమునకు పన్ను డబ్బుని ఆలయ నిర్మాణానికి వెచ్చించినందుకు కారాగారబద్ధుడైనాడు. శ్రీ సీతారాముడు స్వయంగా తానీషా ప్రభువుకి టాకీ చెల్లించి భక్తుడైన గోపన్నను ఖైదు నుంచి విముక్తి చేసి భక్తుల మీద తన ప్రేమని చాటాడు. గోపన్న చేయించిన ఆభరణాలన్నీ ఇప్పటికీ వున్నాయి. ప్రతి శ్రీరామనవమికి రాష్ట్ర ప్రభుత్వం తరుపున ముత్యాల తలంబ్రాలు స్వామికి పంపుతారు. అప్పుడు జరిగే కళ్యాణం ఆలిండియా రేడియో. టి.వి.ల్లో ప్రసారం చేస్తారు. భద్రాచలం నుంచి 6 కి.మీ. దూరంలో

ఉన్నఉష్ణగుండం,38 కి.మీ. దూరంలో వున్న పర్ణశాల (ఈ పర్ణశాలలో సీతమ్మవారు చీరలారేసుకున్న గుర్తులు. రాములవారిని. లక్ష్మణుని శూర్పణఖ కవ్వించినచోటు చూడవచ్చు) వైకుంఠ ఏకాదశి ముందురోజు వరకూ ఒక్కొక్క రోజు ఒక్కొక్క అవతారంతో మత్స్య, కూర్మ వరాహ-నారసింహ, వామన, పరుశురామ, శ్రీరామ, బలరామ, శ్రీకృష్ణ దశావతారములతో శ్రీస్వామి వారికి అలంకారములు జరుగుతాయి. శ్రీ వైకుంఠ ఏకాదశినాడు తెల్లవారుఝామున 5 నుంచి 6 వరకు ఉత్తర ద్వారా దర్శనం. ఈ సీతారామ చంద్రుల సందర్శనము ధర్మ, అర్థ, కామ, మోక్షములను చతుర్విధ పురుషార్థములను ఇచ్చును.

కన్నతల్లిలా చల్లగా వుండి ప్రవహించే గోదావరి మనోహర నేత్రపర్వంగా వుంటుంది. దేవస్థానము సత్రములు. కాటేజీలున్నాయి వసతికి.

**అన్నపురెడ్డిపల్లి** : కాకతీయుల కాలంనాటి దేవాలయం వుంది. శ్రీ బాలాజీ వేంకటేశ్వర ఆలయం ప్రసిద్ధమైనదిక్కడ.

**మోతెమెట్ల** : గోదావరి ఎగువగా ప్రయాణిస్తే 6 కి.మీ. దూరంలో కాకతీయులు నిర్మించిన వీరభద్రాలయం వుంది.

**పాల్వంచ** : థర్మల్ పవర్ స్టేషన్, స్పాంజి, ఐరన్ పరిశ్రమలున్నాయి.

**వేలకొండపల్లి** : బౌద్ధస్థూపాలతో పాటు విరాటరాజు దిబ్బ, కీచరగూడెం వున్నాయి.




కరీంనగర్ జిల్లా
ధర్మపురి
అదిలాబాద్ జిల్లా
మహారాష్ట్ర
నిజామాబాద్ జిల్లా
జగిత్యాల
మంథని
వేములవాడ
కరీంనగర్
సిరిసిల్ల
మధ్యప్రదేశ్
ఖమ్మం జిల్లా
మెదక్ జిల్లా
వరంగల్ జిల్లా

# కరీంనగర్ జిల్లా



**చరిత్ర :** కాళిదాసు రచించిన మేఘసందేశ కావ్యంలోని రామగిరి ఈ జిల్లాలోనిదే. సయ్యద్ కరీముద్దీన్ అనే అతను నిర్మించటంతో కరీంనగర్ అనే పేరు అతని పేరున వచ్చింది. కాకతీయులు, మొగలాయిలు, గోల్కొండ నవాబులు, చాళుక్యులు పాలించిన ప్రదేశం. ఇక్కడ వున్న దేవాలయాలలో ఎక్కువ ఒరియా శాసనాలున్నాయి.

1906లో హైదరాబాద్ రాష్ట్రంలో కరీంనగర్‌గా ఏర్పడిన ఈ జిల్లా 17°51' –19°5' ఉత్తర అక్షాంశములు 78°29' – 80°22' తూర్పురేఖాంశాల మధ్య వుంది.

ఈ జిల్లా ముఖ్య కేంద్రం కరీంనగర్. అనేక వందల సంవత్సరాలు తెలుగు భాషకు ప్రాముఖ్యత లేని పాలనలో ఉన్న ఈ జిల్లా సరిహద్దులు.

ఉత్తరవైపున గోదావరి, తూర్పున మధ్యప్రదేశ్, దక్షిణ మెదక్ జిల్లా; పశ్చిమాన నిజామాబాద్.

**ఈ జిల్లా వైశాల్యం : 11,823 చ.కి.మీ.**

**అటవీప్రాంతం : 21%**

**జిల్లా జనాభా 30,37,000**

**శాసనసభా నియోజక వర్గములు 13, లోక్ సభా నియోజక వర్గములు 2**

**నదులు : మానేరు, గోదావరి**



**ముఖ్యపంటలు :** మొక్కజొన్న, వరి, పెసలు, వేరుసెనగ, చెరకు, ప్రత్తి, నూనె గింజలు.

**పరిశ్రమలు :** చేనేత పరిశ్రమలు, పంచదార, సిమెంట్.

ఈ జిల్లా ప్రధాన కేంద్రం నుంచి అనేక ప్రాంతాలకు దూరం కి.మీ. లలో భద్రాచలం 289, శ్రీశైలం 415, తిరుపతి 734, విజయవాడ 350, విశాఖపట్టణం 643, కి.మీ సిరిసిల్ల 60, జగిత్యాల 50, పెద్దపల్లి 35, రామగుండం 130, మంథని 69.

**తెలంగాణా జిల్లాలోని ఎక్కువ పుణ్యక్షేత్రములు గల ఈ కరీంనగర్ జిల్లాలో దర్శనీయ స్థలాలు -**

**రామగిరి :** కాళిదాసు రచనలోని రామగిరి ఇదే. ప్రస్తుతం కోట శిథిలావస్థలో వుంది. కరీంనగర్ నుంచి 40 కి.మీ. దూరంలో వున్న ఈ మార్గం చూడదగ్గది. సీతారాముల ఆలయంతో పాటు శ్రీరాముడు స్థాపించిన శివలింగము సీతాదేవి పసుపు కుంకుమల భరిణి వుంది.

**జమ్మికుంట:** 700 సంవత్సరాల క్రితం నిర్మించిన కోట వుంది.

**మహాదేవ పురం** : ప్రతాపరుద్రుని నాటి కోట వుంది. ఈ మహాదేవ పురం దిగువగా పలిమెల గ్రామం దగ్గర గోదావరికి ఇంద్రావతి కలుస్తుంది.

**కాళేశ్వరం** : ప్రాణహిత, గోదావరి సంగమ స్థలంలో నిర్మించిన క్షేత్రం. ఒకే పానవట్టంలో కాళేశ్వర లింగము, ముక్తేశ్వర లింగము వున్నాయి. ఇక్కడి పూజలు వల్ల యమలోక బాధలు తొలగి మోక్షం వస్తుందని భక్తుల నమ్మకం.

**నంగ్నూరు** : ప్రతాప రుద్రుని కాలంలో నిర్మించిన ఆలయం వున్నది. నృత్య భంగిమల సజీవ శిల్పాలు మిమల్ని అబ్బుర పరుస్తాయి.

**వేములవాడ** : శ్రీరాజ రాజేశ్వరి ఆలయము వుంది. ఈ వేములవాడ వెళితే యమలోకం లేదట. ఆలయం ఎదురుగా వున్న కోనేటికి రాజరాజ నరేంద్రుడు మెట్లు కట్టించాడు కరీంనగర్‌కి ముప్పయి కిలోమీటర్ల దూరంలో ఉన్నది ఈ క్షేత్రం.

**హుజూరాబాద్** : 700 సంవత్సరాల నాటి కోట వుంది. ఇక్కడ నేత పరిశ్రమలో బ్రహ్మాండమైన పనివారలు వున్నారు.

**మంథని**: జ్యోతిలింగాలతో పాటు కాకతీయుల కాలంనాటి శిలాశాసనా లున్నాయి.

**రామగుండం** : రెండు థర్మల్ విద్యుత్ కేంద్రాలున్నాయి. కరీంనగర్ లనుంచి 65 కి.మీ. దూరం.



# అదిలాబాద్ జిల్లా



చరిత్ర : గోదావరికి ఉత్తర భాగమందలి ఈ జిల్లా అడవులకు ప్రసిద్ధి. జిల్లాప్రధాన కేంద్రం అదిలాబాద్. ఈ జిల్లా 18°40' - 19°56', ఉత్తర అక్షాంశం 77°47' - 80° తూర్పురేఖాంశంపై వున్నది.

1905లో అదిలాబాద్ జిల్లాగా ఏర్పడ్డ ఈ జిల్లాను గోండులు వెలీయ రాజులు పాలించారు.

సరిహద్దులు :- దక్షిణంవైపున కరీంనగర్, నిజామాబాద్ జిల్లాలు, ఇక మిగిలిన మూడు వైపుల మహారాష్ట్ర వుంది.

ఈ జిల్లా వైశాల్యం : 16,105 చ.కి.మీ.

అటవీప్రాంతం : 44%

ఇందు జనాభా : 20,82,000

శాసనసభ నియోజక వర్గములు 9, లోకసభ నియోజక వర్గములు 1

నదులు : గోదావరి, ప్రాణహిత, సుద్ధవాగు, పెనగంగ

ముఖ్య పంటలు : జొన్నలు, మిరప, నువ్వులు, వరి, ప్రత్తి

పరిశ్రమలు : కాగితం, ప్రత్తి, సిమెంట్

ప్రపంచ ప్రసిద్ధి పొందిన ఆటబొమ్మలు 'నిర్మల్ ఆటబొమ్మలు' తయారయ్యే నిర్మల్ ఈ జిల్లాలోనిదే ముఖ్యకేంద్రం కరీంనగర్ నుంచి అనేక ప్రాంతాలలో



బాసర : సరస్వతీదేవి

దూరం (కి.మీ.లలో) - భద్రాచలం 499, శ్రీశైలం 568, తిరుపతి 887, విశాఖపట్టణం 853, విజయవాడ 560, నిర్మల్ - 82, పోచంపాడు - 112, భైలాసా - 130, మంచిర్యాల - 135, సరిపూర్ - 175.

బాసర : శ్రీ జ్ఞాన సరస్వతీ దేవాలయము ఉంది. ఒకప్పుడు ఈ క్షేత్రం పేరు వ్యాసపురి. ఇచ్చట వ్యాస భగవానుడు మహాలక్ష్మి, మహాసరస్వతి మహా కాళిలలను స్థాపించారు. కాని మహాసరస్వతికే విశేష పేరు. ఇది ఆదికవి వ్యాసుడు ప్రతిష్ఠించిన సరస్వతీదేవి విగ్రహం.

పవిత్ర గోదావరి మహానదికి 60 మైళ్ళ దూరంలో ఉన్న ఈ శ్రీ సరస్వతీదేవి ఆలయం కాక మనదేశంలో కాశ్మీరము నందు మాత్రమే ఇంకొక దేవాలయం ఉంది. హైదరాబాద్ నుంచి 120 కి.మీ., ధర్మాబాద్ నుంచి 10 కి.మీ., అదిలాబాద్ నుంచి 145 కి.మీ. ఈబాసర శ్రీ జ్ఞాన సరస్వతీదేవికి తూర్పున ప్రకారాంతర్భాగమున ఔదుంబర వృక్షము ఉంది. క్రింద దత్త పాదుకలు ఉన్నాయి.

ఇప్పటికి సంతాన ప్రాప్తికై అనేకమంది స్త్రీలు వచ్చి అమ్మవారిని సేవిస్తారు.

ఆలయం చుట్టు ఎనిమిది దిక్కులయందు ఎనిమిది తీర్థములున్నాయి. ఇంద్ర, సూర్య, వ్యాస, వాల్మీకి, విష్ణు, గణేశ్, శివ తీర్థముల మధ్య శ్రీ సరస్వతీ తీర్థము కలదు. ఇక్కడే వ్యాస సమాధి ఉంది.

పావన గంగా జలము అంతర్వాహినిగా వచ్చి కలుస్తుందని ప్రతీతి. ప్రతి సంవత్సరం విజయదశమికి ఉత్సవాలు జరుగుతాయి. విజయదశిమి రోజున శ్రీజ్ఞాన సరస్వతీ దేవికి పల్లకీ సేవ జరుగుతుంది.

**నిర్మల్:** జఫ్రుఖాన్ కోటబురుజులతో చూపులకి అహ్లాదంగా దర్శనమిస్తుంది. దగ్గరనే మహాదేవాలయం వుంది. ఇక్కడే ప్రసిద్ధి పొందిన బొమ్మలు తయారు చేస్తారు.

**ఝర్గరామేశ్వరం :** కొండలమధ్య ఆలయం ఉంది. ఇక్కడున్న నీటి గుంటల్లో నీరు ఎలా వస్తుందో ఇప్పటికీ తెలియదు.

**సోమేశ్వరాలయం :** 7వ శతాబ్దానికి చెందిన సోమేశ్వరాలయం వుంది. చక్కటి శిల్ప సంపదచూడవచ్చు.

**కుంతల :** బ్రహ్మాండమైన జలపాతం ఉంది. సోమేశ్వరలింగస్వామిని దర్శించవచ్చు ఈ జలపాతం దగ్గర.

ఇంకా ఘనాపూర్ జలపాతం, కనకదుర్గ జలపాతం, గాయత్రి జలపాతం వున్నాయి.

**జైనాథ్ ఆలయం :** లక్ష్మీనారాయణ దేవాలయం వుంది. స్వామి పాదాల వద్ద కిరణాల పడ్డప్పుడు శిలాశాసనంపై 'సూర్యాయనమః' అని మనం చూసి తరించవచ్చు





రాష్ట్ర ప్రభుత్వ అవార్డ్ గ్రహీత

# మైథిలీ వెంకటేశ్వరరావు

## రచనలు, ప్రచురణలు

| | |
|---|---|
| భారతదేశ యాత్రాదర్శిని | 90-00 |
| దక్షిణ భారత యాత్రాదర్శిని | 50-00 |
| ఉత్తర భారత యాత్రాదర్శిని | 50-00 |
| హిమాలయాల యాత్రాదర్శిని | 50-00 |
| శ్రీదేవి స్తోత్ర మకరందం | 40-00 |
| శ్రీశివ స్తోత్ర మకరందం | 40-00 |
| నవగ్రహ స్తోత్రములు | 40-00 |
| శ్రీవిష్ణు స్తోత్ర మకరందం | 40-00 |
| Small Scale Industries | 100-00 |
| (143 స్వయంఉపాధి పథకాలు - ప్రాజెక్ట్ రిపోర్ట్స్) | |
| శ్రీమత్ సుందరకాండ | 125-00 |
| A.P. టూరిస్ట్ గైడ్ | 25-00 |

పై పుస్తకాలు M.O. పంపిన Regd. లో పుస్తకాలు పంపబడతాయి.

**సరస్వతి పబ్లికేషన్**

సత్యనారాయణపురం, విజయవాడ - 11.